

శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీవిష్ణుపారమ్యవైభవము.

———

శ్లో. శ్రియం శ్రియఃపతిం వన్దే తల్పం తస్యాయుధాని చ.
సేనాధీశం వాహనం చ భూషణా న్యుపచారకాన్. 1

తా. గ్రంథారంభమునం బరిపూర్తికొఱకు ఇష్టదేవతాప్రార్థనము శిష్టులసంప్రదాయమం దేర్పడినందుచేత నిగ్రంథమందేర్పడిన శ్రీ శ్రియఃపతులను, ఆశ్రియఃపతికి మంచి మంచముగ నేర్పడినఆదిశేషుని సుదర్శనాదిపంచాయుధములను. ఆతనిసేనాధిపతియగు విష్వక్సేనుని వాహనమగు గరుత్మంతుని. అతనిభూషణములను ఉపచారములుగ చేసెడి వారిని నమస్కరించుచున్నాను.

శ్లో. యత్రక్వాపి సదా సర్వైః హరి రో మితి సూచ్యతే.
వేదారంభే కేనచి ద్వా హరిరో మితి నోచ్యతే. 2

తా. ఏదేశమందుగాని యేకాలమందుగాని వైదికులందఱిచేత వేదారంభకాలమున “హరిః ఓ” మనియే ప్రారంభింపఁబడుచున్నది; గాని యొకానొకకాలమందైనను యొకానొక దేశమం



శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీ విష్ణుపారమ్యవైభవము.

---

శ్లో. శ్రియం శ్రియఃపతిం వన్దే తల్పం తస్యాయుధానిచ.
సేనాపతిం వాహనం చ భూషణాన్యుపచారకాన్. 1

తా. గ్రంథారంభమునం బరిపూర్తికొఱకు ఇష్టదేవతాప్రార్థనము శిష్టులసంప్రదాయమం దేర్పడియుండుటచేత నీగ్రంథమందేర్పడిన శ్రీ శ్రియఃపతులను, ఆశ్రియఃపతికి మంచముగా నేర్పడినఆదిశేషుని సుదర్శనాదిపంచాయుధములను, ఆతనిసేనాధిపతియగు విష్వక్సేనుని వాహనమగు గరుత్మంతుని, అతనిభూషణములను, ఉపచారములను చేసెడి వారిని నమస్కరించుచున్నాను.

శ్లో. సర్వత్ర సర్వదా సర్వైః హరిరోమితి హ్యుచ్యతే,
వేదారంభే కేనచిద్వా హరిరోమితి నోచ్యతే. 2

తా. ఏదేశమందుగాని యేకాలమందుగాని వైదికులందఱి చేత వేదారంభకాలమున "హరిః ఓ" మనియే ప్రారంభింపఁబడు చున్నది; గాని యొకానొకకాలమందైనను యొకానొక దేశమం

పైనను యొకానొకనిచేతగాని "హరః ఓ" మని ప్రారంభింపఁ బడదు. హరిహరశబ్దములు "హృఞ్ హరణే" అనునొక ధాతువు నుండి నిష్పన్నములైనను వైదికులందఱు "హరిః ఓ" మనియే వాడుకలోనున్నది. కాన హరిపరత్వము శిష్టవైదికసమ్మతము.

శ్లో. ప్రణవేన తు యో వేద్యః పఠ్యతే ప్రణవేన సః,
ప్రణవేన హరిం శిష్టాః పఠన్తి న హరం కదా. 3

తా. ప్రణవముచేఁ బ్రతిపాదింపఁబడు పురుషుఁడు యెవఁడో అతఁడు ప్రణవముతోనే పఠింపఁబడును. కావున శిష్టులు ప్రణవముతో హరిశబ్దముఁ జేర్చి పఠించుచున్నారు. హరశబ్దమును ఎప్పుడును చేర్పరు.

శ్లో. సంఖ్యా సాంకేతికా వర్ణాః ద్రావిడ్యాం సంతిచేత్యతః,
అకారేఽష్టాక్షరీ జ్ఞేయా నైవ పంచాక్షరీ భవేత్. 4

తా. ద్రావిడభాషయందు అకారాదివర్ణములలో కొన్ని వర్ణములే కొన్ని సంఖ్యలకును గుర్తు లగుచున్నవి. అట్టిసంకేత మందు (అ) (அ) అనగా ౮. యెనిమిది లెక్క బోధింపఁబడుచున్నది గాన అకారము మొదటిది. అందుచేఁ దెలియు అష్టాక్షరీ మంత్రము అందు ప్రతిపాదింపఁబడు నారాయణుఁడును ప్రధమపురుషుఁడని తెలియందగు. అ అనునది యైదుఅను సంఖ్యకు సంకేతము కాదుగాన పంచాక్షరియు అందు ప్రతిపాదింపఁ బడుపురుషుఁడును ప్రథమపురుషుఁడు కాఁడని తెలియందగు.

శ్లో. వేదైశ్చ్వేద్యో విష్ణురేవ గీతాయాం స్వయ మబ్రవీత్,
వేదాక్షరాణి విష్ణోస్తు నామానీతి మునేర్మతం. 5

తా. 'వేదైశ్చ సర్వై రహమేవవేద్యః' అను గీతావచనము చొప్పున వేదములచే వేద్యుఁడైన పురుషుఁడు తానని యే విష్ణువైన శ్రీకృష్ణుఁడు గీతయందు వివరించెను. శ్లో. వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజోత్తమ, తావంతి హరినామాని కీర్తితాని న సంశయః- అను విష్ణుధర్మోత్తరమందలి వచనము చొప్పున, వేదాక్షరము లన్నియు విష్ణువుయొక్క నామములని వ్యాసపరాశరుల యభిప్రాయము. కాన సర్వవేదప్రతిపాద్యుఁడగు పరమాత్మ నారాయణుఁడని సిద్ధాంతము. అందుచేతనే వేదారంభమున "హరిః ఓ" మని ప్రారంభించెదరు.

శ్లో. వేదేషు యజ్ఞ స్సృష్టా క్తః యజ్ఞో వై విష్ణు రుచ్యతే,
యజ్ఞానాం ఫలకృ ద్విష్ణుః విష్ణ్వ్యక్షేఽఖిలం భవేత్.

తా. వేదములయందు యాగమే ప్రధానముగ విస్తారముగ వివరింపఁబడి యున్నది. (ఇందుకై హరివంశమున నద్భుతమహిమానువర్ణనగాధయందు నయితము గమనింపుఁడు. అట్టియజ్ఞమనుశబ్దము (శ్రు. యజ్ఞో వై విష్ణుః.) అనుశ్రుతిచేతను విష్ణువుకే పర్యాయనామము. శ్లో. బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా - అనుగీతావచనభాష్యములనుబట్టి యజ్ఞమందలి సర్వము విష్ణుమయ మని సిద్ధాంతము.

శ్లో. దేవానా మవమో హ్యగ్నిః విష్ణుస్తు పరమోభవేత్,
విష్ణోరుచ్చై శ్చుచేర్నీచైః వరాంచి ద్భాతిదేవతా.

తా. "శ్రు. అగ్నిర్దేవానా మవమః విష్ణుః పరమః అగ్నిరవమో దేవతానాం విష్ణుః పరమః" అనేశ్రుతులవలన దేవతలలో నగ్ని చిన్నవాఁడును విష్ణువే పెద్దవాఁడును అనియేర్పడుచున్నది. విష్ణు వునకు పైభాగమునను, అగ్నికిఁగ్రిందిభాగమునను నేదేవతయు లేదు. సకలదేవతలును ఈ అగ్ని విష్ణువుల మధ్యలో నిమిడియుండ వలెనని తెలియుచున్నది; గాన విష్ణువుకంటెఁ బెద్దవాఁడు లేఁడని సిద్ధాంతము

శ్లో. అంగీ విష్ణు శ్శిరః ప్రోక్తః పాదో వహ్ని రితి స్మృతః,
తయో ర్మధ్యే సర్వదేవాః అంగభూతా హరే రితి. 8

తా. విష్ణువే ప్రధానమైన శిరసువంటి అంగియనియు అగ్ని పాదభూతమైనకడపటియంగమనియు, "అంగా న్యన్యే దేవతాః" అను శ్రుతిచేత తదితరబ్రహ్మరుద్రాదు లందఱు అంగభూతమైన వారని తీర్మానము. ఇందుకు "లలాటాత్ క్రోధజో రుద్రః" అను శ్రుతియు, భారతమందలి నానాపర్వములయందుండు కేశ వాదినామనిర్వచనములును నిదర్శనములు.

శ్లో. నారాయణస్యానువాకే నారాయణపదేన హి,
పరబ్రహ్మాదిలింగానాం భూయస్త్వే వ్యక్త్యా పరో హరిః. 9

తా. శ్రావణమందు తర్పణమును గైకొను యాజ్ఞిక్యుపనిషత్తు నారాయణానువాకమునందు "నారాయణః" అనువిశేష్యశబ్ద ముతో నారాయణుఁడు పరబ్రహ్మయని తత్త్వమునారాయణుఁ డని, పరమ తేజస్సు నారాయణుఁడని, పరమాత్మ నారాయణుఁ

డనిపలుమాఱుచెప్పినందుచేతను, 'సూ. లింగభూయస్త్వాత్తద్ధిబలీయః' అను బ్రహ్మసూత్రము ననుసరించి నారాయణుఁడే పరమాత్మయని సిద్ధాంతము. అనేకక్రియలు నారాయణానువాక మంత్రములచేతనే నెరవేరవలయును. అందు అంగభూతదేవతామహిమానువర్ణన ముండినను జగత్కారణభూతమైన పరమాత్మను ప్రధానముగఁ బ్రతిపాదించుటచేతనే "నారాయణః"మని వేదమందుఁ జెప్పఁబడినది యని విద్యారణ్యభాష్యమునందు ఆరంభమున వివరింపఁబడి యున్నది.

శ్లో. క్వచిచ్ఛాఖాసు శంభ్వాద్యాః కారణత్వేన సూచితాః,
తేఽపి నారాయణే లీనాః నాన్యంనారాయణోఽశ్రయత్. 10

తా. కొన్ని శాఖలయందు ఒకానొకచోట "శంభు రాకాశమధ్యేధ్యేయః" అని. 'ఏకఏవ రుద్రో నద్వితీయోవతస్థే' అను కారణవాక్యములు కాన్పించుచున్నవి. అట్టినామము లన్నియు నారాయణశబ్దమునకు విశేషణవాచకములై యోగార్థములతో అన్వయింపఁబడుచున్నవి. ఇందులకు నిదర్శనము నారాయణానువాకమందు "విశ్వశంభువ"మనియు, "శాశ్వతగ్ం శివ మచ్యుత" మని "విరూపాక్ష"మని నారాయణునికి శివశంభు విరూపాక్షాదిశబ్దములు విశేషణములుగఁ జేర్చియున్నవి. విశేష్యమగు నారాయణశబ్దము సంజ్ఞావాచకమై రూఢియైనందున శివాదిశబ్దములకు విశేషణమైనచోఁ గలియదు; కాన విశేష్యమే నారాయణశబ్ద మగును.

శ్లో. విష్ణ్వాద్యాః పఠితా శ్శబ్దాః శివనామసహస్రకే,
నారాయణేతి శబ్దస్తు పఠితో నైవ భారతే. 11

తా. విష్ణ్వాదిశబ్దములు శివసహస్రనామమున విశేషణ ముగఁబఠించియుండినను, సంజ్ఞావాచకమగు టవర్గాన్తనారాయణనామము భారతమందలి శివసహస్రనామమునఁ బఠింపఁబడలేదు; కావుననే శ్రీశంకరభగవత్పాదులును– "శ్రు. యతిర్నారాయణం వదేత్, యతిర్నారాయణం జపేత్" అనునుపనిషద్వాక్యముల ననుసరించి, తన యతిత్వము చెడిపోకయుండుటకై శివసహస్రనామమున నారాయణనామములేమిచేఁ దాము భాష్యమును వ్రాయక, నారాయణ నామశిరస్సుతోఁ గూడిన విష్ణునామసహస్రమునకు భాష్యమును వ్రాసి, అందులో విశేషణములుగ నేర్పడినశివాదినామములను నారాయణునికే మునినిర్వచననిష్పత్తులతో నన్వయించి భాష్యమును వ్రాసిరి.

శ్లో. శంభ్వాద్యా బహవ శ్శబ్దాః కారణత్వేన సూచితాః,
నారాయణస్యాఽనువాకే చోక్తా నామసహస్రకే. 12

తా. శంభ్వాదిబహుశబ్దములు కారణవాక్యములతో కాన్పించినను, అవి యన్నియు నారాయణానువాకమునందును విష్ణుసహస్రనామావళియందును చేరి, నారాయణనామముతో విశేషణములై, లీనములై యున్నవి.

శ్లో. నానావతారా ఆమ్నాయే ష్వామ్నాతాః పరితాంచితాః;
వరాహ శ్చోద్ధృతా సీతి శ్రుతౌ కృష్ణశ్చ సూయతే. 13

తా. అనేక అవతారములు వేదములందు తెలుపఁబడియు న్నవి. అందులో "(శ్రు. ఉద్ధృతాఽసివరాహేణ కృష్ణేన శత బాహునా.) అను తైత్తిరీయశ్రుతియందు వరాహావతారము ను, కృష్ణావతారమును, కొనియాడంబడి యున్నవి. భూమిని ఉద్ధరించుటయందు వరాహావతారము కృష్ణావతారము అనునీ రెండును సమానములే యగును. భారతమున గోవిందనామనిర్వ చనమునందు భూమ్యుద్ధరణము ఉపబ్రహ్మణముగాఁ గానఁబడు చున్నది.

శ్లో. త్రీణీతిమంత్రే సంప్రోక్తా త్రివిక్రమపదాకృతిః,
గోవిందుర్ద్విప్సమంత్రేణ గోవిందమహిమా నుతా. 14

తా. "త్రీణిపదా విచక్రమే" అను శ్రుతియందు త్రివిక్ర మావతారము నుతికెక్కినది. "గోవిందు ర్ద్విప్స ఆయుధాని బిభ్రత్" అను ఋగ్వేద మంత్రమునందు గోవింద నామమహి మము కొనియాడఁబడి యున్నది.

శ్లో. ఋగ్వేదే రామచరిత మామ్నాతం భద్రమంత్రతః,
రామో విష్ణూ రమా సీతే త్యుక్తమార్షస్తవే బహు. 15

తా. ఋగ్వేదమునందు "శ్రు. భద్రోభద్రయా" అను మంత్రమందును, ఆనిరుక్తియందును, సీతతోడ రామచరిత్రము కొనియాడఁబడి యున్నది. అట్టిరాముఁడు విష్ణువని సీత లక్ష్మి యని రామాయణమందలి ఆర్షస్తవమున విస్తరించి వ్రాసియు న్నది.

శ్లో. గాయత్ర్యాముచ్యతే బ్రహ్మ తేజస్సూర్యస్య భాసురం,
తత్తేజో మామకం విద్ధీత్యాహగీతాచ వైష్ణవమ్, I6

తా. గాయత్రియందు సూర్యుని యొక్క ఉత్తమమైనతే జస్సు పరబ్రహ్మమని తెలియుచున్నది. అదియె బుద్ధిని ప్రేరే పించును. అట్టిబుద్ధిని ప్రేరేపించు సూర్యునియందలి పరబ్రహ్మ మగు తేజస్సు "తత్తేజో విద్ధి మామక" మనెడు గీతావచనము చెప్పిన వైష్ణవతేజస్సని తీర్మానము.

శ్లో. ఆదిత్యాంతస్థదేవస్తు శ్రూయతే రుక్మభా ఇతి,
మనుర్నారాయణంప్రాహ రుక్మభాసం నిజస్మృతౌ. 17

తా. ఛాందోగ్యోపనిషత్తునందలి యంతరాదిత్యవిద్య యందుఁబ్రతిపాదింపఁబడు పరమపురుషుఁడు బంగారుపురంగు వాఁడని "ఆప్రణఖాత్ సర్వఏవ సువర్ణః" అనుశ్రుతిచేతఁదెలి యుచున్నది. అట్టిసువర్ణపురుషుని మనువు నారాయణుఁడని తన స్మృతియందుప్రారంభమునఁదెలిపి, తనస్మృతి ముగింపులో ధ్యా నమునకు విషయభూతుఁడగు పురుషుఁడు స్వర్ణవర్ణుఁడని చెప్పి, అ తనిని ధ్యానించవలయు నని ముగింపుచేసెను; గాన నాఛాందో గ్యోపనిషత్తునందలి ఆచార్యపరంపరలోఁ జేరినమనువు, "తద్ధై తద్బ్రహ్మ ప్రజాపతయే, ప్రజాపతిర్మనవే, మనుః ప్రజాభ్యః అనుశ్రుతి చెప్పిన మనకుఁబ్రధానాచార్యుఁడుగ నేర్పడిన మను వే, ధ్యేయుఁడు నారాయణుఁ డని తీర్మానమును చేసెను.

శ్లో. ఆదిత్యవిద్యా ఛాందోగ్యే ఛాందోగ్యస్య గురుర్మనుః,
విద్యాబ్రూతే రుక్మభాసం తం తునారాయణంమనుః. 18

తా. ఛాందోగ్యోపనిషత్తునందు ఆదిత్యవిద్య యున్నది. ఛాందోగ్యోపనిషత్తునకు మనువు గురువుగ నేర్పడెను. ఆదిత్య విద్య. ధ్యేయపురుషుఁడు, స్వర్ణవర్ణుఁడని తెలుపుచున్నది. ఆపురుషుని నారాయణుఁడని మనువు చెప్పుచున్నాఁడు.

శ్లో. తైత్తిరీయే సము ద్రేంత రితి మంత్రసుబోధితః,
విష్ణుఃక్షీరాబ్ధిశాయీతి జ్ఞాయతే స్తవరాజసిః. 19

తా. తైత్తిరీయమునందు "శ్రు. యమన్తస్సముద్రే కవయో వయన్తి. తై-నా-ఉ-సముద్రే న్తం విశ్వశంభువం" అన్నశ్రుతులచే సముద్రమందలి పురుషుని కవులు ఆశ్రయించుచున్నారు. సముద్రమందలి సకలసుఖకరుని క్షీరాబ్ధిశాయినిగాబోధించుచున్నది, భా. శాం. మో. నారాయణీయమునందు మహాపురుషస్తవమున "సముద్రాధివాస యశోవాస, తపోవాస దయావాస, లక్ష్మ్యా వాస" అని నారదునిచేఁ గొనియాడఁబడి యున్నది. భా-శ్రీ-67 అధ్యాయమున—శ్లో. అప్స్వైవశయనంచక్రే మహాత్మా పురుషో త్తమః, సర్వదేవమయోదేవః యోగా త్సుష్వాప తత్రహి. అప్స్వేవ శయనం చక్రే మహాత్మా పురుషోత్తమః" అనుశ్లోకమునందును పైశ్రుతులకు ఉపబ్రహ్మణముగ క్షీరాబ్ధిశాయిత్వమునుకూడ వివరించుచున్నది.

శ్లో. సూరిభి ర్దర్శనీయ స్తు విష్ణు రిత్యేవ సర్వదా,
'తద్విష్ణో' రితి మంత్రేణ ప్రతీతం ప్రతిపాద్యతే. 20

తా. తద్విష్ణోః పరమంపదం సదా పశ్యన్తిసూరయః-

అను శ్రుతిచే చెప్పిన నిత్యసూరులు నెల్లప్పుడును విష్ణువునే చూచు చున్నారని తెలియుచున్నది.

శ్లో. కఠోపనిషది ప్రోక్తజితేంద్రియనరోత్తమః,
ప్రయాతి శాశ్వతంముక్త్యై తద్విష్ణోః పరమం పదం. 21

తా. కఠోపనిషత్తునందు తెలిపినజితేంద్రియుఁడగు పురుషునికి నిత్యముగ నివసించు మోక్షస్థానము విష్ణువుయొక్క పరమపద మని, "విజ్ఞానసారథి ర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః, సోధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమంపదం" అను శ్రుతి చెప్పుటఁ దెలియుచున్నది.

శ్లో. కాణ్వమాధ్యందినాధీతమంత్రాంతర్యామితా తయా,
విష్ణోరేవాస్తి గీతాతః భీష్మకృత్స్తవరాజతః. 22

తా. శుక్లయజుర్వేదమందలి మాధ్యందినశాఖయందును కాణ్వశాఖయందును పఠించిన(యో ఆత్మని తిష్ఠన్)అనువాక్యమందలి జీవునికి అంతర్యామిగనుండి నియమించువాఁడు విష్ణువే యగును. ఏలయనఁగా సర్వమును సృజించి, సర్వమును ప్రళయమునుచేసి, మిగులువాఁడే సర్వనియామకుఁడుగానుండవలయును. ఇందులకు నిదర్శనముగా, భారతమున నారణ్యపర్వమునందు మార్కండేయుఁడు యుధిష్ఠిరునకు బోధించువేళ, ఆమహాప్రళయమున వటపత్రశాయిగా మిగిలినవాఁడు శ్రీకృష్ణుఁడని తెలిపెను. మఱియు, భీష్మకృతస్తవరాజమందు(రుద్రాత్మనేనమః- ఉగ్రాత్మనేనమః) అనుశ్లోకములచేత రుద్రునికిని, అంతరాత్మ

యావిష్ణువే యని తెలిపి, ఆయంతర్యామియే నారాయణుఁడని అతఁడేగీతనుపదేశించిన కృష్ణుఁడని స్తవరాజమునందు ముగింపున తెలిపినందుచేత సర్వాంతర్యామి విష్ణు వని సిద్ధాంతము.

శ్లో. గాయత్ర్యాః ప్రతిపాద్యస్తు విష్ణురేవేతి నిర్ణయః.
తత్సమానే చాదికావ్యే విష్ణుస్సామ్యాత్ ప్రతిపాదితః. 23

తా. గాయత్రియందుఁ బ్రతిపాదింపఁ బడుపురుషుఁడు విష్ణువనుటకు నిదర్శన మేమనఁగా, గాయత్రితో సమానధర్మముగల ఆదికావ్యమగు రామాయణమునందు విష్ణువే ప్రతిపాదింపఁబడెను.గాయత్రికి రామాయణమునకు సమానధర్మమెట్లనఁగా, గాయత్రికి ౨౪-అక్షరములు. రామాయణమునకు ౨౪౦౦౦ శ్లోకములు. గాయత్రికి ౫ శిఖలు. రామాయణమునకు ౫౦౦ సర్గలు. గాయత్రికి సూర్యుఁడు దేవత. రామాణమునకు సూర్యవంశమందు పుట్టినపురుషుఁడు దేవత. గాయత్రికి విశ్వామిత్రుఁడు ఋషి.రామాయణమునకు నతఁడేఋషి. గాయత్రి స్త్రీలింముగ దెలియుచున్నది. రామాయణమును సీతచరిత్రముగనే తెలియుచున్నది. ఇట్లు అన్ని విధములలోను, సామ్యమును గుర్తెఱుంగఁగా వచ్చును.

శ్లో. పౌరుషస్యచ సూక్తస్య దేవో నారాయణ స్స్మృతః,
తేన నారాయణం చార్చే దితి స్మృతికృతాం మతిః. 24

తా. కొన్నిమహాపాపముల నివృత్తికొఱకును, పురుషసూక్త మేర్పడినది. అట్టిపురుషసూక్త మంత్రములకు ఛందోఋషి

దేవత లేర్పడినవి. అట్టి దేవత పురుషసూక్తమునకు నారాయణుఁ డని నిబంధనగ్రంథములందు గానంబడుచున్నది. ఋగ్వేదమం దలి పురుషసూక్తమునకు ఋషిచ్ఛందస్సులతో దేవత నారా యణుఁడని తీర్మానము. నారాయణుని అర్చించుట పురుష సూక్తముతోనే కావలయు నని ధర్మశాస్త్రకర్తల యభిప్రా యము. శ్లో. విధినా పురుషసూక్తస్య గత్వా విష్ణుం సమర్చ యేత్. అని హారీతమహామునియు, (ఇచ్చట అక్షరాధిక్య మార్షము.) శ్లో. ఋషి ర్నారాయణ స్సర్వ్రతః, నారాయణస్య భగవాన్ పరమాత్మాతు దేవతా - అని నారద శౌనక శాండి ల్యాదులును వ్రాసియున్నారు.

శ్లో. ముక్త్యై భక్తి ర్ముఖ్యతమా భక్తే రారాధనం పరం,
ఆరాధనాయ మంత్రాణి పౌరుషాణీతి నిర్ణయః. 25

తా. మోక్షమునకు భక్తియేముఖ్యము. భక్తికి షోడశోపచా రాత్మకమైన ఆరాధనమే ముఖ్యము. అట్టి ఆరాధనకు మంత్ర ములు పురుషసూక్తముచేతనే యేర్పడవలయును అని ధర్మశా స్త్రిమందు వ్రాసియున్నది గదా.

శ్లో. ఆరాధయేయుః పురుషం శాఖిన స్సకలా అపి,
పౌరుషం త్రిషు వేదేషు పఠితం తత్స్వరేణ చ. 26

తా. పురుషసూక్తమునందు ప్రతిపాదింపఁబడు పురుషుని సకలశాఖలవారును ఆరాధించెదరు. అట్టిపురుషసూక్తము 3 వేదములయందును, నాయా వేదస్వరములతో నాయా వేదము

లందు ప్రకటింపఁబడి ఆయా వైదికులచే నధ్యయనము సేయఁబ డుచు, ఆరాధనమునకుగాను షోడశఋక్కులుగా ప్రకటింపఁబడి విని యోగింపఁబడుచున్నవి.

శ్లో. సూక్తమంత్రోపచారాణాం సంఖ్యాయాః సామ్యతః పరం.
ఆరాధనాయ మంత్రాణి పౌరుషాణీతి నిర్ణయః. 27

తా. పురుషసూక్తమంత్రములు ఋగ్వేదమునందు 16 గను, ఉపచారములు 16 గను సమానమై ఉండుటను బట్టియు, పరమపురుషుని ఆరాధించుటకు పురుషసూక్తమంత్రములే యగును. ఇట్లు శివారాధనకు మంత్రోపచారములు సమములుగ పొసఁగవు. నమకచమకాదులు గాని, ఇతరమంత్రములు గాని, ఒకశాఖా వారు మఱియొకశాఖామంత్రములతో నారాధించుకొనఁగా వలయును.

శ్లో. అస్యేశానేతిమంత్రేణ జగతో మధిపా రమా.
సా విష్ణుపత్నీ త్యామ్నాతా పర సా స్త్ర క్ష్వావా హారిః. 28

తా. "అస్యేశానా జగతో విష్ణుపత్నీ"-అను శ్రుతి చెప్పిన జగత్తునకు నధ్యక్షురాలు లక్ష్మియని తెలియుచున్నది. అట్టిలక్ష్మీ దేవి విష్ణువుయొక్క పత్నియని తెలియుచున్నది.

శ్లో, యాజ్ఞక్యాంచోపనిషది బ్రూతే నారాయణం శ్రియం,
ప్రాహ తే శ్రియో నిత్యవాసం విష్ణోరుపనిషన్మతే. 29

తా. యాజ్ఞక్యోపనిషత్తుగు నారాయణానువాకమందు లక్ష్మీ దేవిని నారాయణునిపత్నియని, చెప్పియున్నది. అట్టిలక్ష్మీదేవికి

నిత్యనివాసము నారాయణునివక్షస్థలమందని భారతము నలక్ష్మీ నివాసస్థానపరిగణనమునందు- శ్లో. నారాయణేత్వేకమనా వసామి నియతా మునే- అనుశ్లోకముచేతను మహాపురుషస్తవమున (లక్ష్మ్యైనివాస.) అనువాక్యముచేతను తెలియుచున్నది.

శ్లో. అంభ్రృణీ సూక్తసూక్తా శ్రీః యంయం కామయతే చ తం,
తచ్ఛ్రియా కారయే దుగ్రం బ్రహ్మాణం విష్ణురవ్యయః. 30

తా. ఋగ్వేదమందు పఠించియుండు అంభ్రృణీసూక్తమునందు ప్రతిపాదింపఁబడిన లక్ష్మీదేవి యేమనుజునియందు కటాక్షముంచునో, ఆలక్ష్మీదేవిచేతనే ఆమనుజుని రుద్రు నైనను బ్రహ్మనైనను ఋషినైనను ముముక్షువునైనను చేయునట్లు విష్ణువు సంకల్పించును. (శు)ఆప్రమాణమంత్రము యం కామయే తంత ముగ్రం కృణోమి,తం బ్రహ్మాణం,తం ఋషిం తంసుమేధాం, యీఋక్కునందే (మమయోనిరప్స్వ అంతస్సముద్రే అనువాక్యమందు ఆలక్ష్మీదేవిని సముద్రమందలి నీటిలోఁదన శక్తికి మూలకారణమున్నది వ్రాసినందున జగత్కారణభూతుఁడగు పరమాత్మ జలశాయిగానున్నందున అతనివల్లనుండియే, నాకుఇంత మహిమ కలిగినదని వ్రాసియున్నందున రుద్రునికి ఉత్పత్తి యున్నదని తెలియుచున్నది.

శ్లో. ప్రతిపాద్యో బ్రహ్మసూత్రైః గీతయా విష్ణురేవ హి,
గీతాస్థ్యాద్విషయం వాక్యం సాఽస్య చ్ఛబ్దమయీహ రేః. 31

తా. బ్రహ్మసూత్రములచేఁ బ్రతిపాదింపఁబడువాఁడు విష్ణు

వని సిద్ధాంతము. ఎట్లనగా బ్రహ్మసూత్రములయందు స్మృతే. అనుసూత్రములకు విషయవాక్యము మీమాంసాభాష్యముల యందు భగవద్గీత యేర్పడినది. అట్టిగీతయందంతటను, హరి యగు కృష్ణుడు 'నేను నన్ను, నాచేత, నాకొఱకు, నావలన, నాయొక్క, నాయందు, అని అస్మచ్ఛబ్దములచేతనే నిండియున్నది. ఆయస్మచ్ఛబ్దములకు భాష్యకారులు పలుమారు నారాయణాఖ్యునిగానే సిద్ధాంతపరచి యున్నారు.

శ్లో. నారాయణేతి శబ్దస్య ణత్వ సిద్ధ్యై సంజ్ఞయా.
భాష్యకర్త్రాఽవదత్తస్మాదాఖ్యాం నారాయణాదిషు. 32

తా. నారాయణశబ్దమునకు టవర్గణకారము సిద్ధించుట (సూ. పూర్వపదాత్సంజ్ఞాయా మగః) అనుపాణినిసూత్రముచే సంజ్ఞయందే యేర్పడును. అందుచే నారాయణ వాసుదేవ విష్ణ్వాదిశబ్దములతో, శంకరభగవత్పాదులు ఆఖ్యాశబ్దము తోడనే, విష్ణ్వాఖ్య వాసుదేవాఖ్య నారాయణాఖ్య లని పరిష్కరించిరి.

శ్లో. నారాయణస్య మంత్రస్య ప్రణవ శ్శోత్తమాంగకం,
తేనైవాష్టాక్షరీ స్యాద్ధి నస్యాత్పంచాక్షరీ తథా. 33

తా. నారాయణమంత్రమునకు ప్రణవము శిరస్సుగానేర్పడినది. ఆప్రణవముతోనే 'అష్టాక్షరి' యనిపించుకొనుచున్నది. శివపంచాక్షరి మొదలైనవాటికి ప్రణవము చేర్చకయే 'పంచాక్షరి' యగునని తెలియుచున్నది. మంత్రసిద్ధికై ప్రణవమేగాని స్వభావములో ప్రణవము లేదు.

శ్లో. అకారః ప్రణవేముఖ్యః నిష్పన్నో హ్యవతే స్సచ,
అవతిః ప్రాయశోఽ విష్ణోః, అవతారాస్తు తత్పరాః. 34

తా. ప్రణవమునకు అకారముముఖ్యము. అట్టియకారము రక్షణార్థకమగు అవధాతువుచేత నిష్పన్నమైనది. అట్టిసంరక్షణము తఱుచుగా విష్ణువువలననే యేర్పడును. అవతారము లన్నియు సాధుసంరక్షణమునకు,అసాధుశిక్షణమునకును ఏర్పడినవి యని గీతయందే తీర్మానము.

శ్లో. ప్రవః పాన్తమితి శ్రుత్యా విష్ణో రర్చన మీరితం,
అథాతే విష్ణవిత్యేషా విష్ణో స్స్తవన మాహ చ. 35

తా. ఋగ్వేదమునందు 'ప్రవఃపాన్తమన్ధసోధియాయతే మహే శూరాయ విష్ణవే చార్చత' అనుమంత్రములును, యజుర్వేదమునందు(అథాతే విష్ణో విదుషాచ వృధ్యాః, బృహత్తే విష్ణోసుమతిం భజామహే అనుమంత్రములున్ను విష్ణుకైంకర్యాదులను బోధించుచున్నవి.

శ్లో. తదస్యేతి సుమంత్రేణ విష్ణవే య న్నివేదితం,
తదన్నభు గ్నరో విష్ణోః బంధువత్పరమః ప్రియః. 36

తా. "తదస్య ప్రియ మభిపాథోఽ అశ్యాంనరోయత్ర దేవయవో మదన్తి ఉరుక్రమస్య సహి బంధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వఉత్సః" అనుమంత్రముచేత విష్ణువునకు నివేదనము చేయఁబడిన అన్నమును తినువాఁడు విష్ణువునకు పరమప్రియుఁడు అని తెలియుచున్నది. ఇందులకు మహాన్తులు సతిపురుషులయాచారము నిదర్శనము.

శ్లో. ధృతోర్ధ్వపుండ్రమంత్రేణ నారాయణ మనామయం,
పౌరుషైః సూక్తమంత్రైశ్చ పూజయేత్తత్ప దేప్సయా. 37

తా. మహోపనిషత్తు నందలి "ధృతోర్ధ్వపుండ్రః పరమేశితారం నారాయణం పూజయతిస్మ భక్త్యా, అర్ఘ్యాదిభిః పౌరుషసూక్తమంత్రైః సమాప్నుయా ద్విష్ణుపదం మహాత్మా" అను యీమంత్రమందు నారాయణుని పురుషసూక్త మంత్రములచే ఆరాధించువాడు విష్ణుపదమును పొందుచున్నాడని నిబంధనగ్రంథము లన్నింటియందును వ్రాసినందున విష్ణుపూజ చేయమనిన్ని, అందుకు పురుషసూక్తమంత్రములు ముఖ్యములనిన్ని వ్రాసియున్నది.

శ్లో. న తే విష్ణో ఇతి శ్రుత్యా మహిమా పరమా హరేః,
ఇత్యుప బృంహణా ర్థాయ గీతాయా మపి సూయతే. 38

తా. ఋగ్వేదమందు "న తే విష్ణో జాయమానో నజాతః దేవ మహిమ్నః పరమంతమాప" అను శ్రుతిచేత పుట్టినవాడును పుట్టుచుండినవాడును నీమహిమను తెలుసుకొనజాలడు అని వ్రాసియున్నది. ఇందుకు నుపబృంహణము, గీతయందు "మాంతు వేద న కశ్చన" అనగా నేను అన్నిటిని తెలుసుకుందును. నన్ను యెవడును నాదయలేక తెలుసుకొనజాలడు అని వ్రాసియున్నది.

శ్లో. సోఽబ్రవీద్బ్రాహ్మణశ్రుత్యా పశూనామధిపో హరః,
విష్ణో ర్వరా త్పశుపతిత్వం ... 39

తా. యజుర్వేదమందలి బ్రాహ్మణమున "సోఽబ్రవీద్వరం వృణా అహమేవ పశూనా మధిపతి రసానీతి. తస్మా ద్రుద్రః పశూనా మధిపతి రితి, అస్య దేవస్య మీఢుషో వావ విష్ణోరేత స్య ప్రభుదేహావిర్భిః విధేపా మద్రియం మహత్త్వమితి" అను మంత్రములచే విష్ణువుయొక్క వరములవలన పరమశివునికి పశుపతి పట్టకోరికకలిగినది. రుద్రమంత్రము లన్నియుమాహా త్మ్యమును పొందినవి. ఇందు కుపబృహ్మణము భారతరాజ ధర్మానుశాసనమున (మహాదేవ స్సర్వ మేధే మహాత్మా) అను వచనార్థమును గమనింపుడు.

శ్లో. సామవేదే గిరీశస్య బ్రహ్మపుత్రత్త్వ మాహ చ,
తదుపబృంహణార్థాయ భారతే బహుధాఽవదత్. 40

తా. సామవేదమందు పరమశివునిగురించి"(శ్రుతి)విరూ పాక్షాయ దత్తాంజయే బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయశ్రే ష్ఠాయ అమోఘయకర్మాధిపతయే" అని వ్రాసియున్నందున శివుడు బ్రహ్మకుమారుడని తెలియుచున్నది. ఇందు కుపబృం హణము భారతమున బహుస్థలములలో వచనములను ఇందలి భారతవివరణమున వ్రాసియున్నాము.

శ్లో. సర్వేషా మాశ్రమిణాం పరివ్రా డుత్తమోత్తమః,
స తు కర్మసు సర్వేషు నారాయణపరాయణః. 41

తా. బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థుల ముగ్వురికన్న సన్యాసి "యతి రాశ్రమిణాం తథా" అనువచనమును బట్టి

పూజ్యుఁ డగును. అట్టిసన్న్యాసి, అన్నికర్మములయందును, నారాయణమంత్రముచేతనే ఆహ్నికమును నెరవేర్చుకొనఁ దగినవాఁడుగ నున్నాఁడు. నిబంధనగ్రంథము లన్నింటియందు నను కానంబడును. గమనింపుఁడు.

శ్లో. విష్ణో ర్లింగ మితి వ్యాఖ్యా తురీయ స్యాశ్రమస్య తు,
నారాయణస్మృతి రితి యతిలేఖం తు దృశ్యతే. 42

తా. సన్న్యాసాశ్రమమునకు విష్ణులింగధారణ మని పేరు.అత్రిస్మృతియందు"ముఖజానా మయంధర్మో య ద్విష్ణో ర్లింగధారణం, యావ న్న ధారయే ద్విప్రో వైష్ణవం లింగ మాదరాత్" అనువచనములను బట్టి గమనింపుఁడు. మాటల యందుగాని,వ్రాయుటయందు గాని, యతి నారాయణ నామ క్రియామయుఁడుగనే యుండవలయును. యతులు చేవ్రాలు బెట్టవలసిన లౌకికకార్యములందును "నారాయణస్మృతిః" అని చేవ్రాలు పెట్టుచున్నారు. యతులకు పే రుంచుట, బహ్వృచపరిశిష్టమందు"సూ. అథాస్మై నామదద్యాద్వైష్ణవం" అని వైష్ణవసంబంధమయినపే రుంచవలయును. వ్యాఘ్రస్మృతి యందు. "శ్లో. కృత్వా వ్యాత్పద్మనిలయే విష్ణ్వాఖ్యాం విశ్వసం భువం" అనువచనముచే ధ్యానించవలసిన పురుషుఁడు విష్ణువని పే రుండవలసినవాఁడుగా నుండవలయును. కాత్యాయనస్మృతి యందు "శ్లో. త్రికాల మేకకాలం నా పూజయే త్పురుషో త

మం." అని పురుషసూక్తపురుషునిఁ బూజింపవలయును. వ్యాసస్మృతియందు. "విష్ణోః పాదోదకం జుష్టం నైవేద్యస్య చ భక్షణం, నిర్మాల్యధారణాం చైవ మహాపాతకనాశనం" అనుటచే విష్ణుపాదోదక తీర్థప్రాశనము, విష్ణునివేదితాన్న భక్షణము. "యః పూజయే ద్ధరిం చక్రే సాలగ్రామసముద్భవే; ముక్తిం యాతి నరోఽవశ్యం సాలగ్రామశిలార్చనాత్" అనుటచే సాలగ్రామపూజయును ప్రశస్తము. చక్రముతోఁ గూడినసాలగ్రామశిలార్చనకంటెను ఇతరబాణలింగాదిపూజ యతికి అప్రశస్తమును పాతిత్యమును అగును. "యోఽసౌవిష్ణ్వాఖ్య ఆదిత్యః పురుషోంతరవస్థితః, సోయం నారాయణో దేవ ఇతి ధ్యాత్వా ప్రణమ్యతాం"అనుబోధాయనవచనముచేత నారాయణధ్యానముతో భిక్షను గ్రహించవలయును. "దద్యా న్నారాయణేత్యేవం ప్రతివాక్యం సదా యతిః" అను దక్షస్మృతివచనమును బట్టి ప్రతిమాటయును,నారాయణశబ్దసంబంధముతోనే యుండవలయును. ఇట్లు యతి బ్రతికియున్నప్పుడును శరీరము విడిచినప్పుడును అంతయు వైష్ణవముతో నిండి యుండును. కనుకనే యతి పరము పూజ్యుఁ డాయెను.

శ్లో. తురీయ శ్చాశ్రమో యేషాం సంఘేన ప్రతిభాతి చ,
నారాయణాశ్రయే తే తు విముఖా న చ వైదికాః. 43

తా. ఏసంఘమునందు సన్న్యాసాశ్రమము సన్న్యాసగుర్తులతోఁ గాన్పించదో, ఆసంఘమువారు నారాయణుని

ఆశ్రయమందు విముఖులుగా నుందురు. నారాయణుని ఆశ్రయించుటయందు సుముఖులైనయెడల సన్న్యాసాశ్రమమును గ్రహించుటలో వారికి కష్టముండదు. కావున సన్న్యాసాశ్రమము వారికి లేదు. నారాయణాశ్రయము లేదు. వారికి వైదికత్వమును లేదు. అట్టివారు ఫలానివారని వాడుకలో గమనింపుడు.

శ్లో. భగవత్పాదకాలచార్యాః గీతాభాష్యే ముహుర్ముహుః,
అస్మచ్ఛబ్దవిశిష్టేనా మూచుర్నారాయణాహ్వయమ్. 11

తా. శ్రీశంకరభగవత్పాదులును గీతాభాష్యమందు పలుమారు శ్రీకృష్ణునిచే తెలియజేయించిన కారణాంశలను బోధించు సక్రింది గీతావచనములనుకూడ విచారణసేయునది.

శ్లో. అహంసర్వస్యప్రభవ, మామేవయేప్రపద్యన్తే, మయాతతమిదంసర్వం,
మత్తస్సర్వంప్రపద్యతే, మదర్థే కర్మకౌంతేయ, మమైవాంశో జీవలోకే,
మయి సర్వ మిదం ప్రోతం.

అను గీతయందలి యీలాటి 7 శ్లోకములతో కూడిన అస్మచ్ఛబ్దములకు "స ఆదికర్తా నారాయణాఖ్యో విష్ణుః" అని ప్రారంభించి, అవతారికలో—

గీతాశాంకరభాష్యే - వైష్ణవసూచిక.

అ. శ్లో.
3. 30. స ఆదికర్తానారాయణాఖ్యో విష్ణు మయిసర్వాణికర్మాణి
మయి దేవే పరమేశ్వరే సర్వజ్ఞే సర్వాత్మని వాసుదేవే.

అ. శ్లో.
4. ౮. బహూని మే వ్యతీతాని, యా వాసుదేవే అనీశ్వరాఅసర్వ శంకా మూర్ఖాణాం తాం పరిహరన్.
 " ౫. ప్రకృతిం స్వా మధిష్ఠాయ=ప్రకృతిం మమ వైష్ణవీం మాయాం
5. ౨౯. జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి=నారాయణం మాం జ్ఞాత్వా
6. ౨౧. యో మాం పశ్యతి సర్వత్ర=యః మాం పశ్యతి వాసుదేవం
 ౩౧. మయి వర్తతే యోగీ=మయి వైష్ణవే పరమే పదే వర్తతే
7. ౧౪. దేవీ హ్యేషా గుణమయీ=మమ ఈశ్వరస్యవిష్ణోః స్వభావభూతా
 ౧౫. న మాం దుష్కృతినో మూఢాః=మాం పరమేశ్వరం నారాయణం
 ౧౯. వాసుదేవ స్సర్వ మితి=య ఏవం సర్వాత్మానంనారాయణం ప్రతిపద్యతే.
8. ౪. అంతకాలే చ మామేవ = అంతకాలే మరణకాలే చ మా మేవ పరమేశ్వరం విష్ణుం స్మరన్ ముక్త్వా పరిత్యజ్య కళేబరం శరీరం యః ప్రయాతి గచ్ఛతి స మద్భావం వైష్ణవం తత్త్వం యాతి.
 ౨౧. యం ప్రాప్య ననివర్తంతే తద్ధామ పరమం మమ = మమ విష్ణోః పరమం పద మిత్యర్థః.
9. ౨౨. అనన్యా శ్చింతయంతో మాం=పరందేవం నారాయణం మాంఆత్మత్వేన గతాః
 ౨౫. యాంతి మద్యాజినోపిమాం=మద్యజనశీలాః వైష్ణవాః మామేవ
 ౩౪. మన్మనా భవ = మయి వాసుదేవే మనో యస్య
10. ౮. అహం సర్వస్య ప్రభవః=అహం పరబ్రహ్మ వాసుదేవాఖ్యం
11. ౩. ఐశ్వరం పురుషోత్తమం=ఐశ్వరం వైష్ణవం రూపం.
 ౯. మహాయోగేశ్వరో హరిః=హరి ర్నారాయణః
12. ౨౦. భక్తా స్తే తీవ మే ప్రియాః=భగవతో విష్ణోః పరమేశ్వరస్య అతీవప్రియా భవంతి తస్మా దిదం ధర్మ్యామృతం ముముక్షుణా

ఆ. శ్లో.

యత్నతో అనుష్ఠేయం, ప్రియం, విష్ణోః పరం ధామ జగమిషుణేతి వాక్యార్థః.

13. ౧౧. మయి చాఽనన్యయోగేన = అనన్యయోగేన అపృథక్సమాధినా, నాఽన్యో భగవతో వాసుదేవాత్పరోఽస్తి అత స్స ఏవ నో గతి రిత్యేవనిశ్చితా అవ్యభిచారిణీ బుద్ధిః.

13. ౧౩. అనాదిమత్పరం బ్రహ్మ= అహం వాసుదేవాఖ్యా పరా శక్తిః, యస్య త న్మత్పరమం.

౧౮. మద్భక్త ఏత ద్విజ్ఞాయ=మయి పరమేశ్వరే సర్వజ్ఞే పరమగురువాసుదేవే సమర్పితసర్వాత్మ భావః.

15. ౪. తతః పదం త త్పరిమార్గితవ్యం=యత్పదం వైష్ణవం త త్పరిమార్గితవ్యం

౬. త ద్ధామ పరమం మమ=విష్ణోః మమ పద మి త్యుక్తం

౭. మ మైవాంశో జీవలోకే=మ మైవ పరమాత్మనో నారాయణస్య

౧౨. త త్తేజో విద్ధి మామకం = మదీయం విష్ణోః స్తజ్జ్యోతిం.

౧౬. భగవత ఈశ్వరస్య నారాయణాఖ్యస్య విభూతి సంక్షేప ఉక్తః.

౧౭. బిభ ర్త్యవ్య య ఈశ్వరః=ఈశ్వరః సర్వజ్ఞో నారాయణాఖ్య ఈశ్వ శీలః.

8. ౬౫. మన్మనా భవ= మాం నమస్కురు, నమస్కార మపి మమైవకురు. తత్ర ఏవం వర్తమానవాసుదేవ ఏవ సమర్పితసాధ్యసాధన ప్రయోజనః మా మేవైష్యసి ఆగమిష్యసి.

౬౭. మాం యోఽభ్యసూయతి= మాం యో వాసుదేవం మనుష్యం ప్రాకృతం మత్వా. అభ్యసూయతి.

అని భాష్యమును వ్రాసినందున శ్రీశంకరాచార్యులవారు శివ

భక్తులు కాక, పరమవైష్ణవభక్తు లని భాష్యకర్తలచే తెలియుచున్నది.

శ్లో. ముండకే తైత్తిరీయే చ బృహదారణ్యకే కఠే,
ప్రశ్నే చ శంకరాచార్యః దర్శయామాస వైష్ణవం. 45

తా. ఉపనిషత్తులందును శంకరాచార్యులవారు భాష్యమును వ్రాయునపుడు మూలమందు నామరూపములు లేకయుండినను తనసిద్ధాంతమునే ప్రదర్శింపఁ జేసిరి. ఇట్లుభాష్యమును చేసినందున శంకరాచార్యులువారు విష్ణుభక్తు లనియే సిద్ధాంతము.

శ్లో. కార్యాత్యయాదిసూత్రస్థభాష్యే త్వావృత్తివర్జితం,
ప్రాప్యం విష్ణోశ్చ తద్ధామ న తు కైలాససంజ్ఞికం. 46

తా. "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్" అనే సూత్రముయొక్క భాష్యమందు "అతః పరిశుద్ధం విష్ణోః పరమం పదం ప్రాప్నువంతి" అనే పంక్తిచేత ముక్తికిఁ బోవువారు బ్రహ్మలోకప్రాప్తికి వెనుక, విష్ణువుయొక్క స్థానమును పొందుదురు అనియు, మఱియును "ఆత్మేతి తూపగచ్ఛన్తి" అనుసూత్రమునందు "ప్రతిమాదిష్వివ విష్ణ్వాది దర్శనమితి చేత్ ప్రతీక ఏవం విష్ణుప్రతిమాన్యాయేన భవిష్యతి" అనువాక్యములందును, "వ్యాప్తే శ్చాసమంజసం" అనుసూత్రమందును, "యథా వా ప్రతిమాదిషు విష్ణ్వాది బుద్ధ్యధ్యాసః" అనువాక్యముచేతను విష్ణూపాసనమును వైష్ణవలోకప్రాప్తిని

ఆచార్యులు వ్రాసిరి; కాని ముక్తులను [illegible] నటుల వ్రాయలేదు.

శ్లో. దృష్టాంతదర్శనే విష్ణుం సాలగ్రామాదికం [illegible],
బాణలింగాదికం శంభుం న దర్శయతి సూత్రకృత్. 47

తా. అట్లనే పైభాష్యకారులు తమభాష్యమం దెచ్చటను ఉదాహరణమును చూపునప్పుడు, విష్ణుసాలగ్రామములను చూపుచున్నారు; కాని శంభుబాణలింగాదుల నెచ్చటను చూపరైరి. "ఉత్పత్త్యసంభవాత్" అనుసూత్రభాష్యమందును, "తత్ర య ఏతాన సుచ్యతే యోఽసౌ నారాయణః పరోఽవ్యక్తాత్ప్రసిద్ధః, పరమాత్మా సర్వాత్మా స ఆత్మనా ఆత్మానమనేకధా వ్యూహ్య వ్యవతిష్ఠత ఇతి తన్న నిరాక్రియతే. స ఏకధా భవతి ద్విధా భవతి త్రిధా భవతీతి శ్రుతిభ్యః పరమాత్మనో అనేకధా భావస్య అధిగతత్వాత్, యదపి తస్య భగవతః అభిగమనాదిలక్షణం ఆరాధనం అజస్రం అనన్యచిత్తతయా అభిప్రేయతే, తదపి న ప్రతిషిధ్యతే, శ్రుతిస్మృత్యోః ఈశ్వరప్రణిధానస్య ప్రసిద్ధత్వాత్" అని భాష్యమును వ్రాసినందున పాంచరాత్రప్రతిపాదితుండును ప్రవక్తయును నగునారాయణుని పరత్వమునకు ఆరాధనకు అంగీకరించినవారైరే కాని, పాశుపతప్రతిపాదిత శివారాధనకును శివపరత్వమునకును అంగీకరింపరైరి.

శ్లో. సర్వోపనిషదో విష్ణుం దర్శయంతి పరాత్పరం,

అంగీచక్రుః భాష్యకారా శ్శంకరాద్యా స్త్రయోఽపి చ. 48

తా. అన్ని ఉపనిషత్తులున్ను విష్ణువునే పరబ్రహ్మ మని చూపించుచున్నవి. ఇందులకు శంకరరామానుజ పూర్ణప్రజ్ఞాచార్యులు ముప్వురు భాష్యకారులును అంగీకరించిరి.

శ్లో. తురీయాశ్రమహీనేన కి మన్య ద్భాష్యకారిణా,
తురీయాశ్రమయుక్త శ్చే ద్గరీయాన్ సజ్జనావళౌ. 49

తా. ఈముప్వురు కాక ఇతరు లెవరైన భాష్యకారు లనిపించుకొన వలసినచో, ముప్వురివలె వీరున్ను సన్న్యాసాశ్రమవంతులుగ నుండినచో, బాగుగ నుండును. సన్న్యాసాశ్రమము లేనిసంఘమం దుండినభాష్యకారులు సాధుసంఘమందు గౌరవము నెట్లు పొందఁగలరు? తమకు సన్న్యాసాశ్రమము లేనందుననే, నారాయణసంబంధమునకు పరత్వమునకు విముఖులైరి. "దీక్షాప్రవేశమాత్రేణ యతి ర్భవతి తత్క్షణాత్" అను అనుపాశు పతాగమవచనమును బట్టి ఆశ్రమ మున్నట్లు అనుకొనిరి; గాని వైదికపద్ధతితో నాశ్రమమును గ్రహించిన వారు కాకపోయిరి.

శ్లో. సంస్కారా క్షేత్రబీజస్థదోషరాశినివారకాః,
గర్భేష్టిః ప్రథమా తేషాం తత్సిద్ధి ర్విష్ణుమంత్రతః. 50

తా. సంస్కారములు స్త్రీపురుషుల మానసికాది సకలదోషములను పోగొట్టునవియగును. వాటిలో మొదటిది

గర్భాధానము. అది "విష్ణు ర్యోనిం కల్పయతు" అనే మన్త్రముచేతనే అనేకసూత్రస్థులకు నెరవేరును గదా!

శ్లో. అన్యేషా మాశ్రమవతాం గృహస్థ స్తూపకారకః,
స తు సాప్తపదీనేన తత్సిద్ధి ర్విష్ణుమంత్రతః. 51

తా. యతిబ్రహ్మచారులకున్ను గృహస్థుడే ఉపకారుడగును. దక్షస్మృతియందు గార్హస్థ్యమును చాల కొనియాడిరి. అట్టిగార్హస్థ్యము సాప్తపదీనముచేత సిద్ధించును. సాప్తపదీనము నెరవేరుట మంత్రప్రశ్నమున "ఏకమిషే విష్ణు స్త్వా న్వేతు" అను విష్ణుమంత్రముచేతనే నెరవేరును.

శ్లో. వైష్ణవేష్ట్యా వినా శుద్ధి స్సంస్కారో నాంతిమో భవేత్,
విష్ణుశేషం వైష్ణవాయ దేయ మి త్యాహ ధర్మరాట్. 52

తా. అపరకార్యము యావత్తును విష్ణుసంబంధముతోనే నెరవేరవలయును. విష్ణుపూజ లేక శుద్ధము కాదు. ఎటులనగా అంతకాలమందుగీతావచనానుసారముగ "అంతకాలేతు మా మేవ" అనుప్రకారముచే విష్ణువునే ధ్యానించవలయును. ఇతరధ్యానము ఆవశ్యకము కాదు. "శ్లో. విష్ణుపాదోదకం యస్మా న్మయి త్వం సిక్తవా న్మనే, ప్రాపితో ఽస్మి త్వయా తస్మాత్త ద్విష్ణోః పరమం పదం" అను నారదీయవచనము చేత, విష్ణుపాదోదకముచే శుద్ధినికావించుట "తులసీదళసంమిశ్ర మపి సర్షపమాత్రకం" అనువచనముచేత తులసీతీర్థమును గ్రహించుటయును, శ్రాద్ధమందు "శ్రీశ శ్శార్ఙ్గీ చ పాత్రే" అని

సాలిగ్రామమునకు నివేదితాన్నమునే బ్రాహ్మణభోజనమునకు ముత్తెలుంగులబ్రాహ్మణులలో 2 తెలుంగులవారికంటె హెచ్చుగనే యుండు బ్రాహ్మణులు పరిమారుటయును, విష్ణువే భుజించినట్లు "ఏకో విష్ణు"వని పఠించుటయును శ్రాద్ధసంరక్షకత్వమును విష్ణువునకే చెప్పుచు, అతనికి అన్నమును సమర్పించుటయును దుర్మరణములవారికి నారాయణబలినితప్పక చేయుటయు, ఏ ప్రాయశ్చిత్తము చేసినను హేమాద్రిమొదలగు నిబంధనగ్రంథకర్తలు తెలిపినభంగిని విష్ణుప్రీత్యర్థమై ఒకశ్రాద్ధమందు భగవన్నివేదితాన్నమును వైష్ణవునకి యివ్వవలయు నని చెప్పినయముని వచనానుసారముగ, అవైష్ణవునికి యీయక. వైష్ణవునికి ఇచ్చుటయును, ఇత్యాదిపద్ధతులచే విష్ణుసంబంధము లేక చరమసంస్కారము శుద్ధము కానేరదు. ఇందుకు నిదర్శనము శంకరభగవత్పాదాచార్యులవారు తమతల్లికి విష్ణువును స్మరింపజేసి, ఉపదేశించి విష్ణులోకమునకు పంపినట్లు శంకరచరిత్రమునందు గలదు గమనింపుడు. నిబంధనగ్రంథములందు శంకరరామానుజపూర్ణప్రజ్ఞులు మువ్వురు భాష్యకారులయొక్కయును, అభిప్రాయప్రదర్శకవచనాచారములను గమనించి, సర్వప్రాయశ్చిత్తములు విష్ణుమంత్రముచేతనే చూపించిరి.

శ్లో. ఆదిమధ్యాన్తసంస్కారాః విష్ణుమంత్రైకజీవనాః,
మధ్యే మధ్యే త్వంగదేవా విష్ణునా భాన్తి కర్మసు. 53

తా. గర్భాధానము వివాహము దేహపరిత్యాగము, ఇవి విష్ణుమంత్రములచేత బ్రతుకుచున్నవి. యీమూఁడిటి మధ్యలో ఉన్నక్రియలందు విష్ణువుగా నితరదేవతలున్న అంగదేవత లైనందునఁ బ్రకాశించుచున్నారు. అంగి విష్ణువని చూపించితిమి.

శ్లో. ఛాందోగ్యాచార్యవర్య స్తు మనుః ప్రాహాత్మన స్స్మృతౌ,
నారాయణో జగత్కర్తా పురుషో రుక్మభా ఇతి. 54

తా. ఛాందోగ్యమందలి ఆచార్యపరంపరలలో నున్న మనువు తనస్మృతియందు "ఆపో నారా ఇతి ప్రోక్తాః" అన్నశ్లోకముచేత జగత్కర్త నారాయణుఁడని జగత్తతనికి శరీరశరీరిభావసంబంధముతో నున్న దని వ్రాయుచు, అతనినె ఉపాస్యునిఁగ ఉపాసనాప్రకరణమందు హిరణ్యప్రకాశముతో నుండెడివాఁ డని తెలిపెను.

శ్లో. నారాయణం శ్రియా యుక్తం ప్రాహ వాథాశ్వలాయనః,
స్మర్తవ్యో హ్యర్చనీయ శ్చ జగతా మధిప స్స చ. 55

తా. ఆశ్వలాయన ధర్మమందు శ్రీదేవితోఁ గూడిన నారాయణుని స్మరించవలయు నని, అర్చించవలయు నని, అతనే సర్వజగత్తుకు అధిపుఁ డని వ్రాసియున్నది. పునహాదేశమున నానందాశ్రమమందు నాగరలిపితో ముద్రించియుండు స్మృతిసముచ్చయమున, ఆశ్వలాయనస్మృతిలో, "శ్లో నిర్గుణాం నిరహంకారం నారాయణ మనామయం, సగుణం చ శ్రియా

యుక్తం దేవం దేవీం సరస్వతీం” అని, “స్మరే న్నారాయణం శ్రాద్ధే ధారయే దంబరం శుచి, కర్మకాలే తు సర్వత్ర స్మరే ద్విష్ణుం హవిర్భుజం, తేన స్యాత్ కర్మసంపూర్ణం తస్మై సర్వం నివేదయేత్, తేనైవ సూక్తజాప్యేన హరేరర్చనకృ ద్భవేత్, లక్ష్మీరూపా మిమాం కన్యాం ప్రదదే విష్ణురూపిణే, ఇటువంటి వచనములను బట్టి ఆశ్వలాయనులు విష్ణుభక్తు లను టకు సందియము లేదు.

శ్లో. శ్రాద్ధసంరక్షక శ్శ్రీశ ఇతి ప్రాహ ప్రజాపతిః,
భోజయే దతిథిం విష్ణుస్వరూపిణ మథేతి చ. 56

తా. శ్రాద్ధమునకు ఆవశ్యకపదార్థములను పరిగణనము చేసి చెప్పిరి. అందున శ్రియఃపతి సాలగ్రామరూపకముగానో, బింబరూపకముగానో ఉండి కావలయు ననిరి. అతిథిని విష్ణు స్వరూపముతో వచ్చిన ట్లెంచ మనిరి. శుద్ధికరపదార్థము లలో గోమయగోమూత్రాదులతో విష్ణుపాదతీర్థము పరమపవి త్రమును గావించు ననిరి. నిన్నటివి కూడదను నిషేధములో గంగాతీర్థమునకు పర్యుషితదోషము లేదనుచు భగవన్నివే దిత తులసీదళముతో కూడినతీర్థమునకున్ను పర్యుషితదోష ము లేదు అని గ్రహించిరి. ఇందుకు ప్రమాణము: —

శ్లో. శ్రీఖండం దర్భసూత్రం యవతిలతులసీశాకపత్రం చకర్తా
ధూపో దీపోదపాత్రం కుసుమఫలజలం పత్రభూమ్యాసనాని
శ్రీశ స్సాత్వ్యే చ పాత్రే ద్విజమధుసకృదాచ్ఛిన్నహోమార్ఘపాత్రా

# శ్రీ విష్ణుపారమ్యవైభవము.

త్యాజ్యం శ్రాద్ధోపహారాః సుకృత్యహ్నిహితే పుత్రవాసాంసి కాలః
త్యజేత్ పర్యుషితం పుష్పం త్యజేత్ పర్యుషితం జలం
న త్యజేత్ జాహ్నవీతోయం తులసీదళపఙ్కజం.
గోమయే నోపలిప్తా భూః పవిత్రా సర్వకర్మసు,
గోమూత్రే ప్రోక్షితా తీర్థే విష్ణుపాదాంబుసేవితా.
అతిథిం శ్రాద్ధరక్షార్థ మన్యే విష్ణుస్వరూపిణం.
నివేశయే ద్విష్ణుసమం బ్రాహ్మణం వేదపారగం
సాక్షా ద్విష్ణు ర్ధర్మరాజః శ్రాద్ధదేవ శ్చ కథ్యతే,
విశ్వే దేవాః పితృతిథిః సర్వం విష్ణు రితి స్మృతం.
(ప్రజాపతిస్మృతి. శ్రీ. నాగ. స్మృ. సము.)

అనుప్రమాణములవలన ప్రజాపతియు పరమవైష్ణవుఁ డని పై స్మృతిసముచ్చయమందలి యీ ప్రమాణమునుగమనింపుడు. శ్రాద్ధ మంతయు పరమవైష్ణవ మని తెలియందగు.

శ్లో. అథ చే న్మన్త్రవి ద్యుక్త వైష్ణవో జ్ఞానవా న్హి సః,
హవ్యకవ్యే నియోక్తవ్య ఇతి ప్రాహ స్వయం యమః.
హవ్యే కవ్యే నియోక్తవ్యః వైష్ణవ స్త్వితి ధర్మరాట్,
జ్ఞానీ తి తం యమః ప్రాహ మంత్రవి ద్వ్యాస ఇతి స్వయం. 57

తా. బ్రతికియుండి చేయుసంస్కారముల యందును గతించిన వెనుక జరుగుపూర్వాపరక్రియలందును, విష్ణుభక్తుని బ్రాహ్మణునిగ నుపయోగించుకొనినవాఁడని యమధర్మరాజు ఉపదేశించెను.

శ్లో. యామిన్యాః పశ్చిమే యామే హరిమేవ స్మరే త్పతి,
వేదవ్యాసో హి భగవాన్ స్వస్మృతా వబ్రవీ న్మునిః. 58

తా. అశ్వమేధమునకు శిరోభూత మైనదియు దివస మంతయు పాత్రీవతుత్రో గడచుటకు మూలభూత మగు ఉషః కాలమున విష్ణువునే స్మరించవలయు నని వేదవ్యాసులు తమ స్మృతియందు వ్రాసిరి. స్మృ. సము. యామిన్యాః పశ్చిమే యామే త్యక్తనిద్రో హరిం స్మరేత్ అని.

శ్లో. శంఖ స్మృతావపి ద్విష్ణుం హి హృదయాకాశమధ్యగం,
వేత్తి శుద్ధో వాసుదేవ మజ్ఞ శ్చేత్తం న వేత్తి హి. 59

తా. శంఖస్మృతియందు హృదయాకాశమందు వసించెడు విష్ణువును ప్రణవసహితముగ ధ్యాననిర్మథనాభ్యాసము చేసి శుద్ధుడైనవాడు వాసుదేవుని తెలుసుకొనుచున్నాడుగాని జ్ఞానములేక యిట్లభ్యసించనివాడు వాసుదేవుని తెలుసుకొనజాలడు అని వ్రాసియున్నది. ఇందుకు ప్రమాణము స్మృతిసముచ్చయములో శంఖస్మృతియందు 2వ అధ్యాయములో,

శ్లో. స్వదేహ మరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిం,
ధ్యాననిర్మథనాభ్యాసా ద్విష్ణుం పశ్యే ద్ధృది స్థితం.
వాసుదేవ స్తమోఽన్ధానాం ప్రత్యక్షో నైవ జాయతే.

**అని. మఱిన్ని ముక్తుడు పోయి చెరేడులోకమును 31-32-33**

శ్లో. అశబ్ద మరసమస్పర్శ మరూపం గంధవర్జితం,
నిర్దుఃఖ మసుఖం శుద్ధం తద్విష్ణోః పరమం పదం.
అజం నిరంజనం శాన్త మవ్యక్తం ధ్రువ మక్షరం,
అనాదినిధనం బ్రహ్మ త ద్విష్ణోః పరమం పదం.

విజ్ఞానసారథి ర్యస్తు మనఃప్రగ్రహాబద్ధవః,
సోఽధ్వనః పార మాప్నోతి త ద్విష్ణోః పరమం పదం.

అని వ్రాసియున్నది. గాన శంఖమహాముని పరమవిష్ణుభక్తుడని తెలియుచున్నది.

శ్లో. జపస్య సన్నిధౌ విష్ణో రానంత్యం లిఖితోఽబ్రవీత్.

తా. విష్ణుప్రతిమాసమీపమున జపముచేసినయెడల అనంతసంఖ్యాకఫల మిచ్చు నని లిఖితస్మృతియందు వ్రాసియున్నది. కాన లిఖితమహామునియు విష్ణుభక్తుడనుటకు సంశయము లేదు.

శ్లో. గౌతమో జపదోషస్య శాంత్యై విష్ణుం స్మరే దితి. 60

తా. జపముచేయునపుడు దోషములేర్పడినచో వాటిని పోగొట్టుకొనుటకై "ఆచామే త్సంభవే చైషాం స్మరే ద్విష్ణుం సురార్చితం" అనువచనమునుబట్టి విష్ణువును స్మరించవలయు నని గౌతములు తెలిపియున్నారు. పరాశర మాధవీయమున సంధ్యావిధియందు (57 పేజీని చూడుడు) ఈయభిప్రాయమునే యోగయాజ్ఞవల్క్యులును సంవర్తమహామునియును, తెలిపియున్నారు.

శ్లో. ఆపస్తంబ వసిష్ఠాది స్మృతి ప్రోక్తమహామునిః,
హారీతస్స్వ స్మృతౌ సర్వాం వైష్ణవం పూర్ణ మబ్రవీత్. 61

తా. ఆపస్తంబ సూత్రమందును వసిష్ఠసూత్రమందును "మిథ్యైతదితిహారీతః" "పతనీయానితిహారీతః" హారీతోక్త్యా గా

హారతి" అనుసూత్రములచే ప్రశంసింపబడు హారీతమహాముని తనస్మృతి సంపూర్ణముగ విష్ణుపరత్వమును విష్ణ్వారాధనా ప్రకారమును విష్ణ్వారాధనాలక్షణములను ఆరాధకుని లక్షణములను ఆరాధకుని కేర్పడు ముక్తిఫలమును వివరముగ వ్రాసిరి. ప్రకృతమున విష్ణ్వారాధన చేయువైఖానసాదులకు యీస్మృతియే మూలభూతముగ నున్నది.

శ్లో. అత్రి స్తు భగవాన్ప్రాహ గోవిందం సంస్మరే దితి,
విద్వేషా దపి కామా ద్వా స్మరే ద్గోవింద మేవ చ. 62

తా. ద్వేషముచేత కాని, కామముచేత గాని, గోవిందుని స్మరించవలయును. అ,స్మృ, 9అధ్యా4. శ్లో. విద్వేషా దపి గోవిందం దమఘోషాత్మజ స్స్మరన్, శిశుపాలో గత స్స్వర్గం కిం పున స్తత్పరాయణః.

శ్లో. భూమింతు వైష్ణవీం ప్రాహు ర్వసిష్ఠా ద్యా మునీశ్వరాః,
వసతాం భువి చాస్మాకం స్వభావా ద్వైష్ణవా శ్శ్రియః. 63

తా. వసిష్ఠ శాతాతపాది స్మృతులందు భూమిని వైష్ణవినిగ (భూర్వైష్ణవీ సూర్యసుతాశ్చ గావః అని) వ్రాసినందున మన మందరము స్వభావముగా విష్ణుసంబంధముతో నున్నారము.

శ్లో. పరాశరో మునిః ప్రాహ బ్రహ్మహత్యా ఘకాంతయే,
దర్శనే రామచంద్రస్య సేతో ర్నలకృతస్య చ. 64

తా. పరాశరమహాముని తనస్మృతియందు బ్రహ్మహత్యాపాపనివారణమునకై నలరామచంద్రులచే నేర్పరచబడిన సేతుదర్శనమును చేయుఁడని, 12 అధ్యాయమున 69 శ్లో. మాధవీయమందు, 333పుటలో, శ్లో. రామచంద్రసమాదిష్టం నలసంచయసంచితం, సేతుం దృష్ట్వా సముద్రస్య బ్రహ్మహత్యాం వ్యపోహతి అనువచనముతో తెలిపిరి.

శ్లో. పంచగవ్యస్య సిద్ధ్యర్థం విష్ణుమంత్ర ముదాహ చ,
పురాణం వైష్ణవం తత్త్వసిద్ధ్యై శంకరసమ్మతమ్. 65

తా. ఆపరాశరులే పంచగవ్యసిద్ధికొఱకు "ఇదం విష్ణుర్విచక్రమే" అనువైష్ణవమంత్రమును జపించి హోమమును చేసి శేషమును భుజించవలయు ననిరి. మఱియు వేదాంతతత్త్వసిద్ధికొరకు విష్ణుపురాణమును వ్రాసిరి. ఆదిశంకరాచార్యులు ప్రబలప్రమాణముగ గైకొని ఆయావిషయములందు అందలి వచనములనే ఉదాహరించుకొనిరి. పరాశరవచనము. శ్లో. పరా. స్మృ. 11అ. 35శ్లో. ఇరావతీ, ఇదంవిష్ణుః, మానస్తోకే తు శంవతీ, ఏతాభి శ్చైవ హోతవ్యం హుతశేషం పిబే ద్ద్విజః ఇట్లు, సుమారు 13 స్మృతికర్తలు వైష్ణవమును వాచా వ్యక్తపఱచిరి. ఇకను ఇతిహాసములందలి వైష్ణవపారమ్యమును గమనించెదము.

శ్లో. జ్ఞాత శ్చేక్ష్వాకువంశీయైః వసిష్ఠాది మునత్ప్రభైః,
అర్చితో విష్ణు రేవేతి రామ స్యాద్యాభిషేకతః. 66

తా. వసిష్ఠాదిమహర్షులచే సకలసంస్కారములను గావించుకొనిన ఇక్ష్వాకు మొదలగు పుణ్యపురుషుల సంప్రదాయము శ్రీరాముని యువరాజ్య పట్టాభిషేకము జరుగనిశ్చయించుకొన్నరోజుకు, ముందుదినమున జరుగవలసిన నియమములలో నారాయణారాధనము గావించినటులను, ఆనారాయణదేవాలయమునందు జానకీరాములను శయనించునటుల వసిష్ఠమహాముని తీర్మానించినటులను, కౌసల్య మొదలగు ముత్తైదువలు రామకార్యసిద్ధికై విష్ణుపూజను చేయుచుండిరని యును తెలియుచున్నది. ప్రమాణవచనములకై, రా. అ. శ్లో. సహపత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్, శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజః, ధ్యాయమానా జనార్దనం—అని.

శ్లో. ఇతిహాసే త్వాదికావ్యే దేవర్షి శరణాగతౌ,
నారాయణస్య పారమ్యం ఋషిభిర్దర్శితం బహు. 67

తా. ఆదికావ్యమైనరామాయణ మనే ఇతిహాసమందు రామావతారప్రారంభమున దేవత లందఱు విష్ణువును అవతారమెత్తమని ప్రార్థించిన వేళలో, నారాయణుని పరత్వము విశేషము కొనియాడంబడి యున్నది. ఇందులకు ప్రమాణవచనముల గమనింపుడు. రా. బా 16. శ్లో. ఏతస్మిన్నంతరే విష్ణురుపయాతో మహాద్యుతిః, శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః, త్వాం నియోక్ష్యామహే విష్ణో, తతో నారాయణో

దేవో నియుక్తస్సురసత్తమైః, దేవానాం విష్ణు రాత్మవాన్, పుత్రత్వం తు గతే విష్ణౌ.

శ్లో. బలాబల పరీక్షాయాం విష్ణుశ్రీకంఠయో స్తదా,
దర్శయ త్యద్భుతం విష్ణోః పారమ్య మతిదైవతం. 68

తా. శివకేశవుల బలాబలపరీక్షార్థ మైన బాలకాండ యందలి కథచే, విష్ణువునందు సర్వదేవతలకంటె మించిన అద్భుతపారమ్య మున్నట్లుగా.

అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తదా,

అను బాలకాండమందలి శ్లోకముచేత తెలియుచున్నది.

శ్లో. బ్రహ్మా స్వయంభూ రిత్యత్ర రామో విష్ణు రితి స్మృతేః
బ్రహ్మాణ మీశం ప్రోవాచ న విష్ణుం హనుమాన్ మహాన్. 69

తా. హనుమంతుడు రావణుని యెదుట రామమాహాత్మ్యమును తెలుపునపుడు, శ్రీరాముడెవనిని చంప నిశ్చయించునో అతనిని బ్రహ్మరుద్రేంద్రాదు లెవ్వరు కాపాడుటకు వచ్చినను కాపాడలే రని ఆనతిచ్చెను. ఆబ్రహ్మరుద్రాదులతో విష్ణువును చేర్చనందున రాముడే విష్ణు వని హనుమంతునికి నభిప్రాయము. ఇందుచేత, విష్ణుసంకల్ప మనివార్య మని భావము.

శ్లో. ఆగ స్త్యస్తవే దరీదృశ్యం విష్ణోః పారమ్య మక్షయం,
బ్రహ్మాదైశ్వర్ద్రర్శితం శుద్ధ మవతార సులాంఛితం. 70

తా. రామాయణమందలి సీతాగ్నిప్రవేశప్రకరణమున బ్రహ్మరుద్రాదులు తేతెంచి, చేయు ఆర్ష స్తవమందు రాముడు విష్ణు వని, సీత లక్ష్మి యని, దేవతాప్రార్థనచే సాధుసంరక్షణకొఱకు అవతార మెత్తి రని సీతారాములను కొనియాడిరి. అట్టి ఆదివ్యదంపతులకు బ్రహ్మరుద్రాదులు అందరు అణగినవా రని పరత్వమును ప్రకటించిరి. ఆర్ష స్తవమును పరిశీలింపుడు. ఈరీతిని ఋగ్వేదమందు రామచరిత్రము గాన్పించుటచే రామాయణము శ్రౌత మైనది. పరాశరస్మృతియందు బ్రహ్మహత్యానివృత్తికై రామకృతసేతువు హేతు వైనందున స్మార్త మైనది. భారతమందు ఆరణ్యపర్వమున మార్కండేయులు రామాయణ మంతయు యుధిష్ఠిరునకు బోధించినందున ఇతిహాసముచేతను కొనియాడబడినది యైనది. ప్రతిపురాణమందును రామచరిత్రమును కొనియాడినందున పురాణములచే నుతి కెక్కినది. రామతాపినీలయందు తంత్రమంత్రమహిమానువర్ణన మున్నందున ఉపనిషత్ప్రసిద్ధ మైనది. అట్టిరామచరిత్రము పరమవైష్ణవ మని సిద్ధాంతము. ఇకను భారతవైష్ణవవిశేషములను గమనించెదము.

శ్లో. భారతం భారవత్త్వం స్యాత్ ప్రపంచే నిస్తులం మహత్.
నాందీ తు భారతే భాతి నారాయణనమఃపరా. 71

తా. భారతము ధర్మార్థకామమోక్షములను సులభముగ తెలుపుచున్నందున ప్రపంచమునకెంతొ బరు వైనది; అద్వి

తీయ మైనది యాగును. అట్టి భారతముయొక్క ప్రారంభము వేదవ్యాసులు భారతగ్రంథపరిపూర్తి కొఱకై మంగళాచరణము నారాయణుని విషయముగనే "నారాయణంనమస్కృత్య" యని ప్రారంభించిరి; గాన ప్రారంభమందే నారాయణ పరత్వపరిమళ ముతోటి భక్తియనెడు చల్లగాలి వీచుటకు ప్రారంభించినది.

శ్లో. నారాయణకథే త్యేవ భారత స్యాహ సూతజః,
అద్వితీయత్వ మప్యాహ తత్కథాయా శ్చ తస్య చ.

తా. సూతపౌరాణికుడు సత్రయాగమందలి మునులకు భారతమును బోధించుటకు ముందుగ వ్యాసమహామునికి నమస్కరించెను. వ్యాసు డెట్టివా డనగా భారతమనే యీనారాయణకధను, మీకు చెప్పునటుల నాకు బోధించి, యనుగ్రహించెనే అట్టివ్యాసునకు నా నమస్కారము చేయుగాక. మఱియు నారాయణకధ యెంత ఫలము నిచ్చునో అంతటిఫలమును ఇతరులయొక్క యేకథయు ఇవ్వదు. నారాయణు డెట్లు అద్వితీయుడో యతనికథయును అద్వితీయ మని నారాయణ పరత్వమును ఆనతిచ్చెను. ప్రమాణము భా. ప్ర.

"శ్లో. నమో భగవతే తస్మై వ్యాసా యామితతేజసే
యస్య ప్రసాదా ద్వక్ష్యామో నారాయణకథా మిమాం
న తథా ఫలదం లోకే నారాయణకథా యథా
నాస్తి నారాయణసమో న భూతో న భవిష్యతి."

శ్లో. నారాయణసమో నేతి త్యేత త్సత్యగిరాఖిలాః,
అర్థాః సంసాధయా మీతి స్తౌతి రాజా హరిం పరం. 78

తా. సూతపౌరాణికుడు యాగకాలమున యాగస్థలమందు సకలమహర్షుల కెదుట నారాయణునితో సమానుడు భూతభవిష్య ద్వర్తమానకాలముల మూటియందును కలుగడు అనునాయీ ప్రమాణవాక్యములచేత సకలపురుషార్థములను సాధించుకొనగలను అని శపథమును చేసెను. ఈసూతపౌరాణికుడు ఇంతటినారాయణపరాయణుడు కానియెడల, ఇతని వద్ద మంచిసమయమున మంచితీరుణమున సకలమునులు విననోపుదురా? గమనింపుడు. ఇతను చెప్పినయంశము సకలవేదాంతసిద్ధాంతసారాంశము కాకపోయినయెడల ఇంతటిమహర్షులు ఏకగ్రీవముగ విందురా? గమనింపుడు [ప్ర. భా. ఆ. ప.]

"శ్లో. నాస్తి నారాయణసమో న భూతో న భవిష్యతి
ఏతేన సత్యవాక్యేన సర్వార్థాన్ సాధయామ్యహం
సర్వాశ్రమాభిగమనం సర్వతీర్థావగాహనం
న తథా ఫలదం లోకే నారాయణకథా యథా"

శ్లో. భారతశ్రవణా న్మర్త్యః వైష్ణవో భవతి స్ఫుటం,
ఇతి విష్ణోః పరత్వంతు భారతే భాతి చాంతిమే. 74

తా. "అష్టాదశపురాణానాం శ్రవణాద్యత్ఫలంభవేత్, తత్ఫలం సమవాప్నోతి వైష్ణవో నాత్ర సంశయః, శ్రుణోతి శ్రావయే ద్వాపి సతతం చైవ యో నరః, సర్వపాతకనిర్ముక్తో వైష్ణవం పద మాప్నుయాత్" అనువచనములచే భారతమును వినిన కారణముచేత యేమనుజుడైనను వైష్ణవుడగుచున్నాడు.

ఇందుకు సందేహ మేమియు లేదు అని భారతముయొక్క ముగిం పున వ్రాసియున్నందున, భారతమంతయు నారాయణకథ యనుటకు సందేహము లేదు. వినినవాడు వైష్ణవు డగునని వ్రాసి యున్నది గాని శైవు డగునని వ్రాయ లేదు; కాన ఆద్యంతము లందు వైష్ణవము వ్యక్త మైనది.

శ్లో. భారతశ్రవణా ద్విష్ణోః ప్రాప్నోతి పరమం పదం,
ఇతి తత్ర ఫలం ప్రోక్తం స్వర్గారోహణపర్వణి. 75

తా. "స్త్రియశ్చపురుషా శ్చైవ వైష్ణవం పద మాప్ను యుః,స్త్రీభిశ్చ పుత్రకామాభిః శ్రోతవ్యం వైష్ణవం యశః-అను స్వర్గారోహణపర్వమునందలి వచనములనుబట్టి భారతమువిన్న వాడు వైష్ణవలోకమున కేగుదెంచును అనివ్రాసినందునఆద్యంత ములందు విష్ణుపర్వతమువ్యక్తము. విన్నవారు కైలాసప్రాప్తి కలవా రగుదురని వ్రాయ లేదు.

శ్లో. భారతే రాజసూయేతు గాంగేయ్యఃప్రాహ ధర్మజం,
పూజనీయతమః కృష్ణో హ్యస్మాభి స్త్రిదశై రితి. 76

తా. సభాపర్వమున రాజసూయయాగమందు భీష్ము డు. స. 37. అ.

శ్లో. వార్ష్ణేయం మన్యతే కృష్ణ మర్హణీయతమం భువి,

అనువచనమును బట్టి కృష్ణుడగు విష్ణువె ప్రథమ మర్యాదకు అ ర్హుడని వ్రాసినది కాక,

శ్లో. నరాః కేవల మస్మాక మయ మర్చ్యతమో చ్యుతః
త్రయాణామపి లోకానా నర్చ నీయో మహాభుజః.

అనువచనములచేత అందరివలనను కృష్ణుడు ఆరాధింపబడతగిన వాడని భీష్ముడు చెప్పినట్లు తెలియుచున్నది.

శ్లో. సర్వసంశయ నిర్మోక్తా సర్వలోకగురుః ర్మునిః,
ప్రత్యక్షకర్తా ధర్మాణాం నారదో విష్ణుతత్పరః. 77

తా. మఱియు రాజసూయయాగ ప్రకరణమందు సర్వ సంశయములను తీర్చెడివాడును, వ్యాసవాల్మీకులు మొదలగు అనేకులకు ఆచార్యులును, అనేకఅంశములను ప్రత్యక్షముగా చూపువాడు [3 పాదముల విశేషణములు భారతమందు అక్కడక్కడ చెప్పిన విశేషణములునగును] అట్టినారదమహాముని పరమాత్మ ముందు బ్రహ్మకెదుట తీర్మానించిన ప్రకారము యిప్పటిభూభారమును తీర్చుటకై కృష్ణుడుగా అవతరించెనుగదాయని దివ్యజ్ఞానమున అన్ని విషయములను ఆకళింపజేసుకొని ప్రకృతమున సభవారినిజూచి శిశుపాలుని విషయమై

శ్లో. కృష్ణం కమలపత్రాక్షం నార్చయిష్యన్తి యే నరాః,
జీవన్మృతాస్తు తేజ్ఞేయాః నసంభాష్యాః కదాచన.

అనువచనముంబట్టి యెవరు పుండరీకాక్షుడైన కృష్ణుని పూజించరో వారు బ్రతికియుండియు చచ్చినవారగుదురు. ఇటులచెప్పుటకు లాభమేమి యనగా కృష్ణవిరోధులు శవములవలె చూడతగినవారును తాకతగనివారునగుదురు. అట్టివారితో మాటలాడతగదు; అందుకు పాప మేర్పడును. ప్రాయశ్చిత్తీయులగుదురు అనిసభలో జగదాచార్యవర్యుడగు నారదుడు వెల్ల

డిచేసెను. ఇందుచే నారదమహామునియొక్క వైష్ణవత్వమును గమనింపుడు.

శ్లో. కృష్ణద్వేషిశిరః పాదసహదేవోత్తమాంగకే,
పుష్పవర్షేణ విజ్ఞేయం క్రియాయా బహుళంఫలం. 78

తా. ఆరాజసూయయాగమందు "కేశవం కేశిహన్తార మప్రమేయపరాక్రమం, పూజ్యమానం మయాయోవఃకృష్ణం నసహ తేనృపః, సర్వేషాంబలినాంమూర్ధ్నిమయేదం నిహితం పదం" కృష్ణమర్యాదను సహించని శిశుపాలాదులను చూచి సహదేవుడు, యెవడు కృష్ణపూజను సహించడో, ఇందరిరాజులలోపల అట్టివానితలపై నాకాలుంచితినని పాదమెత్తి చూపించినంతలో, "పుష్పవృష్టిర్మహత్యాసీత్సహదేవస్యమూర్ధని"అని ఆసహదేవునియొక్క విష్ణుపూజాసద్ధారణ ప్రక్రియకు మెచ్చి, దేవతలు ఆవ్యాసభీష్మనారదాదులందరిలోచిన్నవాడైనను మాటలకన్న క్రియగొప్పదనియెంచి అతనితలపైమాత్రము పుష్పవర్షమును గురిపించిరి. ఇందువలన కృష్ణునికి యీ యాగమందు జరిపించినప్రథమమర్యాద భూలోకమువారికి వలె పైలోకమువారికిని అంగీకారమని తీర్మానమైనది. ఇందుచేత దేవేనసహావర్తత ఇతిసహదేవః అనునామధేయము సహదేవునికి నునిచినది సార్థక మాయెను.

శ్లో. కృతే యుగే జనా స్సర్వే నారాయణపరాయణాః.
ఇత్యూచే హనుమాన్ ప్రాజ్ఞః భారతేఽరణ్యపర్వణి. 79

## శ్రీ విష్ణుపారమ్యవైభవము.

తా. భారతమున అరణ్యపర్వమందలి సౌగంధికాహరణపర్వమందు భీముఁడు హనుమంతుని జూచి, కృతయుగమున జనులనడవడులు ఎటుల నుండు నని యడుగగా, సర్వజనులును ఒక్కవిధముగా నారాయణమంత్రముయొక్క జపముతోను ధ్యానముతోను కూడి, తదితరములగు జపధ్యానాదులను వదలి నారాయణపరాయణులుగ నుందురని, ప్రాజ్ఞుఁడైనసకల శాస్త్రవిశారదుఁడైన హనుమంతుఁడు బదు లొసంగెను. ఇందులకు ప్రమాణ శ్లోకములను గమనింపుడు.

'శ్లో. ఆత్మా చ సర్వభూతానాం శుక్లో నారాయణ స్తథా,
బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా శ్శూద్రా శ్చ కృతలక్షణాః,
కృతే యుగే సమభవన్ స్వకర్మనిరతాః ప్రజాః,
సమాశ్రయం సమాచారం సమజ్ఞానంచ కేవలం,
తదా హి సమకర్మాణః వర్ణధర్మా నవాప్నువన్,
ఏకదేవసమాయుక్తాః ఏకమంత్రవిధిక్రియాః,
పృథగ్ధర్మా స్త్వేకవేదా ధర్మ మేక మనువ్రతాః,
చాతురాశ్రమయుక్తేన కర్మణా కాలయోగినా,
అకామఫలసంయోగా త్ప్రాప్నువంతి పరాం గతిం,
ఆత్మయోగ సమాయుక్తో ధర్మోఽయం కృతలక్షణః'
[భార. తీర్థ. ప. అధ్యా 148 శ్లో 18.]

దీనివలన కృతయుగమునందు సకలజనులు నారాయణపరాయణులు గా నున్నా రనుటకు సందియం బేమియు లేదు. యుగములు మారగా మారగా ధర్మము తగ్గుచు, నారాయణపరా

యణత్వము తగ్గిపోయి, తదితరపరాయణత్వము ప్రారంభించిన దని బుద్ధిమంతులు తెలిసికొనఁ దగును.

మఱియును, కృతయుగమునందు అందఱును కృతలాంఛనులుగా నున్నా రనియు, హనుమంతుఁ డుపదేశించెను. నారాయణసారూప్యమును గోరునారాయణపరాయణులు నారాయణలాంఛనములతోనే యుందు రనియు నేర్పడుచున్నది.

శ్లో. శివేన తు కృతా రక్షా విష్ణో ర్దత్తానువర్తినీ,
మార్కండేయోఽప్యాహ చైవం భారతే ఽరణ్యపర్వణి. 80

తా. మార్కండేయమహాముని అరణ్యమునందు పాండవులకు ధర్మములను బోధించువేళలో, పరమాత్మయొక్క ప్రభావమును తెలుపునపుడు—"ఓయుధిష్ఠిరా! సర్వప్రళయమయినకాలమునందు ప్రపంచ మంతయు నీ రై యేర్పడినసమయములో నెవ్వరు లేక, నేనుమాత్రమే యుంటిని. అనీటిలో నీఁదియీఁది గట్టుగానక శరణ మేర్పడక మిక్కిలి తడిసి తడిసి, బడలి, దుఃఖాక్రాంతుఁడనైనకాలమందు వటవృక్ష మొకటి కాన్పించెను. అందున నొకకొమ్మయందు నీలమేఘశ్యామలుఁడును, శ్రీవత్సాది లక్షణవిశిష్టుండును, సర్వలక్షణలక్షితుడును వక్షస్స్థలంబున లక్ష్మితోటి ఒకశిశువు కనులకరువుతీర నామనంబార కనులకు గోచరం బాయె. అంతనాశిశువు ననుఁజూచి "ఓమార్కండేయా! చాల బడలిక నొందితి వని నాకు తెలియుచున్నది".

అని బాలుఁడు నోరు తెఱవఁగానే నేను అనోటిని చేరు నటుల నాప్రయత్నము లేకయే యేర్పడినది. పిదప నేను లోపల ప్రవేశింపఁగానే, అచ్చట ముందు నేను బయట చూచిన ప్రపంచ మంతయు బ్రహ్మరుద్రాదులతో కనబడెను. అటు పిదప నాబాలునిశరీరములో నున్నప్రపంచమున నేను చాల కాలము తిరుగుచుండగా నేను తనంతట తానుగానే ముఖము నుండి వెలుపలికి వచ్చునటు లాయెను. ఆవెనుక ఆబాలపురుషుని మెత్తనిపాదములను నాచిత్తమొప్పక తలనొత్తి ముత్తమిడి నీవెవఁడ వని నీమహిమ యేలాటిదని యడుగఁగా ఆశ్రీనివాసుఁ డగుపురుషోత్తముఁడు గ్రత్తలిగటాక్షముతో నన్ను కరుణించుచు "నేనునారాయణుఁడని పేరుగలఒకపురుషుడను. ప్రళయకాలమున అంతటిని దిగమ్రింగి సాలెపురుగువలె జగత్తును లోపల నుంచుకొని, నిన్ననుగ్రహించుటకై నీవు బాలుఁడవు గనుక, నేను బాలునిఁగా నీకు కనంబడితిని" అని ఆనతిచ్చి, అందరాని తనమహిమను నాకుపదేశించి, అంతర్ధానుఁ డాయెను. అట్టిపురుషోత్తముఁ డగుపరమాత్మ నీకు మేనమామకుమారుఁడై సందులేని సంబంధములతో నీయోగక్షేమములను శిరసావహించి, చూచి కాచి, సవ్యసాచికి దాచిపెట్టుకున్నధనమువలెను, పాంచాలిని పాలించుటలో వేళయెంచక హేళనము లేకుండునటులను, శీలముతో నున్న యీగోపాలబాలుఁడగు నీకృష్ణుఁడే నాకు వరమిచ్చెను. అతని

మీఁదనే ఆశ కలుగు నటులను, అతఁని మఱువకుండునటుల జ్ఞాపకమును ఇచ్చెను. దీర్ఘాయుస్సు నాకొసంగెను. శరీరమును వదలుటలో నాకే స్వాతంత్ర్యము కలిగించెను, గాని యమ మృత్యువులు నన్ను చంపుటకు శక్తులు కారని తీర్పుతో నేర్పాటు చేసి నన్ను కాపాడెను గదా! అట్టివాఁడు నీకు సంబంధిగ నున్నాఁడే! నీ కేమి కొఱువ" యనెను. ఇందులకు ప్రమాణము.

శ్లో. యస్స దేవో మయా దృష్టః పురా పద్మాయతేక్షణః,
స ఏవ పురుషవ్యాఘ్రః సంబంధీ తే జనార్దనః,
అస్యైవ వరదానాద్ధి స్మృతిర్న ప్రజహాతి మాం,
దీర్ఘ మాయుశ్చ కౌంతేయ స్వచ్ఛందమరణం మమ.
స ఏవ కృష్ణో వార్ష్ణేయః పురాణపురుషో విభుః.
ఆస్తే హరి రచింత్యాత్మా క్రీడన్నివ మహాభుజః.

[భా. వ. ఆర. ప. 89 అధ్యా.]

ఇందు మొదటిశ్లోకమున "అస్యైవ వరదానాద్ధి" అనే ఏవకారముచేతను ఖల్వర్థముతోటి యున్న "హి" యనుఅవ్యయముచేతను మార్కండేయులను కాపాడినది శివుఁడని ప్రవాదముండినను, ఈవిష్ణువుయొక్క సంకల్పమును బట్టియే శివుఁడు కాపాడినాఁడని మార్కండేయమహాముని యొక్క అభిప్రాయము.

శ్లో. వైష్ణవా స్తు విభే ష్యేవ హరిపాదా శ్రయా త్సదా,

ఇత్యబ్రవీచ్చ దుర్వాసాః ఆతిథ్యేఽరణ్యపర్వణి. 81

తా. [భా. అర. 261 అ.] "శ్లో. బిభేమి సుతరాం విప్రాః హరిపాదాశ్రయాజ్జనాత్" అనుశ్లోకమును బట్టి, దూర్వాసమహాముని తనకు ద్రౌపదిచేయు ఆతిథ్యకాలమున తన వారితో చెప్పిన దేమనఁగా, నే నెవ్వరికిని భయపడను గాని విష్ణుపాదాశ్రయు లగు వైష్ణవులను చూచి, చాల భయ పడుదును" అని అంబరీషమహారాజువద్ద తాను పడినపాటు తలంచుకొని చెప్పినందున విష్ణుభక్తి చాలా గొప్ప దని తీర్మానము.

శ్లో. కృష్ణోఽయం పరమాత్మాఽత్ర తద్యుక్తాః పాండవాయది,
జయద్రథజయా నత్వామిత్యరణ్యే హరోఽబ్రవీత్. 82

తా. సైంధవుఁడు శివుని గురించి తపస్సుఁజేసి, పాండవులను జయించుటకై వరమును గోరినపుడు ఆపరమశివుఁడు సైంధవునితో "నీవు కృష్ణార్జునులు దగ్గర లేనిసమయమునను పాండవులు నలుగురుమాత్ర ముండుసమయమునను ఒక్కరోజు మాత్రము జయించవచ్చును గాని కృష్ణుఁడు దగ్గరనుండగా నీకు జయము కలుగదు. ఏలనఁగా ఆకృష్ణుఁడు పరమాత్మ. జగత్తంతయు అతనియధీనము; గాన అతఁడు పాండవులయొద్ద నుండగాఁ నీకు జయము కలుగదు. నేను వరము నిచ్చినను, నీకు సహాయకారి కాదు" అనెను. ఇందుకు ప్రమాణవచనములు. అరణ్యపర్వమందు 271అధ్యాయములో, 47శ్లోకము మొదలు, నారా

కనుల నిచ్చి, గాంధారీదేవిని తనను చూడనిచ్చెను. అప్పటిసభ వారికి తనవిశ్వరూపమును చూపించెను. అంతట సురలు పుష్ప వర్షమును గురియించిరి; గాన కృష్ణుడింద్రజాలమును చేయలేదు. బ్రహ్మవేత్తలకుఁగూడ తన్ను చూడ శక్యము కాకపోయిన వారికి దివ్యచక్షుస్సు నిచ్చెను గాన కృష్ణుఁడు విరాట్పురుషుఁడైనందున బ్రహ్మరుద్రాదులు శరీరమునం దుద్భవించి రనుటకు శంక లేదు. శ్రీశంకరాచార్యులవారును విష్ణుసహస్రనామభాష్యమందు కేశవాదినామములకు భారతనిర్వచన మనుసరించి, తాము బ్రహ్మరుద్రాదులు కేశవుని దివ్యమండలవిగ్రహమం దుద్భవించినట్లు ఉపనిషత్తును చూపి యున్నారు గాన విష్ణువుయొక్క దేహమందు బ్రహ్మరుద్రాదు లుద్భవించుట సహజమే అగును.

శ్లో. చాతుర్విద్యాతి తత్త్వజ్ఞః సర్వశాస్త్రవిశారదః,
బహుబ్రహ్మర్షి వినుతో భీష్మో విష్ణుపరాయణః. 84

తా. భారతమందు శాంతిపర్వంబున యుధిష్ఠిరుని పట్టాభిషేక మైనపిదప శ్రీకృష్ణుఁడు భీష్ముల ధ్యానకాలమందు అతని హృదయమునకు వశుఁడై యుధిష్ఠిరుఁడు యెంత పిలిచినను పలుకక, కొంతసేపటికి యుధిష్ఠిరుని వేదనను సహింపఁజాలక భీష్ముల ప్రభావమును పలువిధములుగా బయలు పెట్టెను.

శ్లో. ఆధారం సర్వవిద్యానాం తమస్మి మనసా గతః

స హి భూతం భవిష్య చ్చ భవ చ్చ పురుషర్షభ!
వేత్తి ధర్మవిదాం శ్రేష్ఠం స్తస్మి న్మహాత్మని
తస్మి న్న స్తమితే భీష్మే కౌరవాణాం ధురంధరే
జ్ఞానా న్యస్తం గమిష్యన్తి
తస్మా త్త్వాం చోదయా మ్యహం
చాతుర్విద్యం చాతుర్హోత్రం చాతురాశ్రమ్య మేవ చ
రాజధర్మాంశ్చ నిఖిలా న్పృచ్ఛైనం పృథివీపతే!

అనఁగా భీష్ముఁడు సకలవిద్యల కాధారభూతుఁ డని భూతభవిష్యద్వర్తమానములను తెలిసినవాఁ డని ధర్మార్థకామమోక్షవిద్యలను యాగసంబంధమైనచాతుర్హోత్రమును, నాలుగాశ్రమములను సకలరాజధర్మములను తెలిసినవాఁ డని, అట్టి భీష్ముఁడు శరీరమును వదలినయెడల సకలజ్ఞానములు లోకమందు లేకపోవునని, అట్టిభీష్ముఁడు యోగసమాధితో నన్ను ధ్యానింపగా నామనస్సుతో నేను అతని నంటి వెంటనేయుంటినని, అట్టి భీష్ముఁడు శరీరమును వదలకమునుపే, అతనియొద్ద సకలధర్మములను అడిగి తెలుసుకొనుము అని కృష్ణుడు చెప్పెడు ప్రకరణమునందు తనయందు భీష్మునికి యున్నభక్తిని అతనిమహిమమును బయలుపరచెను. మఱియును,

శ్లో. యతః ఖలు పరా భక్తి ర్మయి తే పురుషర్షభ
తతో మయా వపు ర్దివ్యం త్వయి రాజ న్ప్రదర్శితం
జ్ఞానాని చ సమగ్రాణి ప్రతిభాస్యంతి తేఽనఘ
చక్షు ర్దివ్యం సమాశ్రిత్య ద్రక్ష్య స్యమితవిక్రమ

యచ్చ త్వం వక్ష్యతే భీష్మ పాండవాయానుపృచ్ఛతే
వేదప్రవాద ఇవ తే స్థాస్యతే వసుధాతలే
యశ్చైతేన ప్రమాణేన యోక్ష్యత్యాత్మాన మాత్మనా
సఫలం సర్వపుణ్యానాం ప్రేత్య చానుభవిష్యతి
వేదోక్తాశ్చైవ యే ధర్మాః వేదాంతాధిగతాశ్చ యే
తాన్ సర్వాన్ సంప్రపశ్యామి వరదానాత్తవాఽచ్యుత.

అనఁగా "ఓభీష్మా! నీకు నాయందు ఉత్తమభక్తియున్నందున, నాదివ్యస్వరూపమును నీకు చూపించితిని. ఇఁక నీకు సర్వవిషయజ్ఞానములు కలిగి, ఎదురుగఁ బ్రతిఫలించును. దివ్యచక్షుస్సును పొంది అన్నిటిని చూడఁగలవు. పాండవులకు నీవు దేనిని ఉపదేశించెదవో అది వేదమందలికథలవలె భూమియందు శాశ్వతముగ నుండఁగలదు. నీవు నుపదేశించిన దానిని ప్రమాణముతో నెవఁడు గ్రహించునో, వాఁడు సర్వపుణ్యఫలమును పరలోకమునఁ బొందును" అని వక్తృవైభవమును, శ్రోతృవైభవమును, ఈగ్రంథవైభవమును, నెలనానెను. అంతట శ్రీకృష్ణునింజూచి భీష్ముఁడు "ఓకృష్ణా! నీవరవిశేషమువలన వేదవేదాంతార్థములను చక్కఁగా చూచుచున్నా" నని బదులొసంగెను; గాన భీష్ముఁడు విష్ణుభక్తుఁ డని సిద్ధాంతము. భారతమందు భీష్మునివంటి మహాత్ముని విరక్తుని సర్వజ్ఞుని మఱియొకనిని చూడఁ బోఁగలమా? లేదు. గాన అట్టిభీష్ముఁడు విష్ణుపరాయణుఁ డని సిద్ధాంతము.

శ్లో. సర్వత్ర భారతే భీష్మః విష్ణోః పారమ్య మబ్రవీత్,
దృష్టం నారాయణం దధ్యౌ అంతకాలే చ సస్మృతిః. 35

తా. భీష్ముఁడు భారతమం దెచ్చటను విష్ణువుకే పరత్వ మును ప్రతిపాదించెను. అంతకాలమందు మంచిజ్ఞాపకముతో నారాయణునే ధ్యానించెను. భీష్మపర్వంబున నాల్గవదినమందలి యుద్ధమందు కృష్ణప్రభావము పాంచరాత్రప్రభావమును ధర్మ పుత్రునికి తెల్పెను. రాజసూయయాగంబునందు, ప్రథమమ ర్యాద శ్రీకృష్ణునికే చేయు మని యుపదేశించెను. కడపట నారాయణస్మరణతో లోకోత్తర మగు స్తవరాజం బనుపేరు గలస్తోత్రమును చేసెను. పిదప నారాయణస్మరణతోఁ బరలో కగతుఁ డాయెను. భీష్ముఁడు ధ్యానించినపద్ధతికి ప్రమాణము.

శ్లో. ప్రాహు ర్నారాయణం దేవం యం విశ్వస్య పరాయణం
అణీయసా మణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసాం
గరీయసాం గరిష్ఠం చ శ్రేష్ఠం చ శ్రేయసా మపి
ఇతి విద్యాతపోయోని రయోని ర్విష్ణు రీడితః
వాగ్యజ్ఞే నార్చితో దేవః ప్రీయతే మే జనార్దనః
నారాయణః పరం బ్రహ్మ నారాయణపర స్సదా
నారాయణఃపరో దేవః సర్వం నారాయణ స్సదా.

ఇట్లుశంకరరామానుజపూర్ణప్రజ్ఞభాష్యకారులు తమగ్రంథము నందు విష్ణుప్రభావప్రకటనకాలమున నుదాహరించిన శ్లోకము లు స్తవరాజంబున ముందే భీష్ములచేఁ గొనియాడంబడిన శ్లోక ములే యగును. అట్టిస్తోత్రమును నారాయణుని చేసెను. ఇట్లు

స్తోత్రమును చేసినభీష్ముని సకలఋషులు కొనియాడిరి, అందుకు ప్రమాణము.

శ్లో. తస్మి న్నుపరతే శబ్దే తత స్తే బ్రహ్మవాదినః
భీష్మం వాగ్భిః బాష్పకంఠా త మానర్చు ర్మహామతిం
తే స్తువంత శ్చ విప్రాద్యాః కేశవం పురుషోత్తమం
భీష్మం చ శనకై స్సర్వే ప్రశశంసుః పునఃపునః

భీష్ముఁడు విష్ణువును ధ్యానమును చేసిన వెనుక బ్రహ్మవేత్తలుధర్మశాస్త్రకర్తలు నగువ్యాసపరాశరాదిమహర్షులు కృష్ణుని కొనియాడిరి. భీష్ములను ఆనందబాష్పములతో గద్గదస్వరముతో పూజించుటే కాక ఒక్కొకరును పలుమారు కొనియాడిరి; గాన భీష్ముఁడు నారాయణపరాయణుఁ డనుటకు ఇంకను ఎన్నియో విషయము లున్నవి. ఇవిగాక, చరమకాలమందు—

శ్లో. భగవన్ దేవదేవేశ సురాసురనమస్కృత
త్రివిక్రమ నమస్తేఽస్తు శంఖచక్రగదాధర
వాసుదేవో హిరణ్యాత్మా పురుష స్సవితా విరాట్
జీవభూతానురూప స్త్వం పరమాత్మా సనాతనః
త్వద్భక్తం త్వద్గతస్వాంత మదార మపరిగ్రహం
త్రాయస్వ పుండరీకాక్ష పురుషోత్తమ నిత్యశః
రక్ష్యా శ్చ తే పాండవేయాః భవాన్ యేషాం పరాయణం
త్వాం తు జానా మ్యహం దేవం పురాణం ఋషిసత్తమం
నరేణ సహితం దేవం బదర్యాం సుచిరోషితం
యథా మే నారదః ప్రాహ వ్యాస శ్చ సుమహాతపాః
నరనారాయణౌ వేతౌ సంభూతౌ మనుజేష్వితి

స మాం త్వ మనుజానీహి కృష్ణ మోక్ష్యే కళేబరం
త్వయాఽహం సమనుజ్ఞాతః గచ్ఛేయం పరమాం గతిమ్

అనువచనములను బట్టి భీష్ముని జీవితమంతయు విష్ణుభక్తితోనే నెరవేరినది; కాన వారిచరిత్రము పరమవైష్ణవము.

శ్లో. భారతే వైష్ణవీ గీతా స్తవరాజ శ్చ వైష్ణవః,
విష్ణో ర్నామసహస్రం చ భాతి శంకరభాష్యతః. 86

తా. భారతమున భీష్మపర్వమందు భగవద్గీత యంతయు వైష్ణవ మని యతివర్యు లగుభాష్యకారులు ముప్పూరు వ్రాసినట్లు మునుపే తెలిపితిని. స్తవరాజమందలి విష్ణుధ్యానపర శ్లోకరత్నములను కాన్పించితిని. విష్ణుసహస్రనామములకు శంకరాచార్యులువారు వ్రాసిననామనిర్వచనప్రమాణశ్లోకములను గమనించినవారు ఎవరైనను శంకరమతద్రోహులు కానియెడల విష్ణువుకే భక్తు లగుదురు గదా. కావున విష్ణుపరత్వమునకు యీ 3 గ్రంధములు అసూయారహితులై ఆశ్రయించ ఇచ్ఛగల వారికి కామధేను కల్పవృక్షచింతామణు లని గుర్తెఱుంగుదురు గాక.

శ్లో. పీతాంబరాగతా గీతా సర్వకారణతాంచితా,
శ్రుతిసూత్రై శ్చ వినుతా వైష్ణవీ గీయతే బుధైః. 87

తా. పరమాత్మ యగు శ్రీకృష్ణుని ముఖమునుండి వెడలిన గీతయంతయు ఉపనిషద్బ్రహ్మసూత్రములందలి సర్వవిద్యలలో నుండుసర్వాంతర్యామిత్వ సర్వాధారత్వ సర్వవ్యాపక

త్వాద్యంశములచే నలంకరింపబడినదియే గాక బ్రహ్మసూత్ర ములలో "స్మృతేశ్చ" అను నానాసూత్రములకు ఉపనిషత్తుల వలె విషయవాక్యమై గ్రహింపఁబడి, శుద్ధవైష్ణవమని వైదికులచే కొనియాడంబడుచున్నది. అవైదికులు అవైష్ణవులు కొందఱు (కొల్లుంనూల్) చంపెడిపుస్తకమని గ్రహింపక యున్నారు. మనయతిపతులగోష్ఠియందు వారికిని వారిమాటలకును ఏమి ప్రవేశ మున్నది?

శ్లో. వేదేభ్య శ్చాధికా గీతా సాక్షా ద్దేవా త్సమాగతా,
యథార్థం చ యథోక్తం చ యతః ప్రాదర్శయ త్స్వయం. 88

తా. వేదములకంటెను భగవద్గీత అధికమైనదే యగును. కారణ మేమనఁగా పరమాత్మనుండి నేరుగా వెడలి యేతెంచిన కారణముచే యథార్థమైనవృత్తాంతమును ఎంత చెప్పెనో, అంతయు తాను అర్జునునకు గోచర మగునట్లు చూపిన కారణము చేతను గీత యెక్కువది యగును.

శ్లో. న వేత్తి యో వాసుదేవం పరమాత్మేతి మానవః,
తామసః ప్రాకృత శ్చేతి భీష్మపర్వణి కథ్యతే. 89

తా. ఎవఁడు వాసుదేవుని పరమాత్మఁగా తెలిసికొనఁడో, వాఁడు పరమతామసుఁడని ప్రాకృతుఁడని భీష్మపర్వమందలి విశ్వోపాఖ్యానమునందు——

[66. అధ్యాయమున 5 వ శ్లోకము మొదలు]

శ్లో. యత్తత్పరం భవిష్యంచ భవితా యచ్చ యత్పరం
భూతాత్మా యః ప్రభుశ్చైవ బ్రహ్మ యచ్చ పరం పదం
తేనాస్మి కృతసంవాదః ప్రసన్నేన సురర్షభాః
జగతోఽనుగ్రహార్థాయ యాచితో మే జగత్పతిః
మానుషం లోకమాతిష్ఠ వ్వాసుదేవ ఇతి శ్రుతః
అసురాణాం వధార్థాయ సంభవస్వ మహీతలే
సంగ్రామే నిహతా ఏతే దైత్యదానవరాక్షసాః
య ఇమే నృషు సంభూతా ఘోరరూపా మహాబలాః
తేషాం వధార్థం భగవాన్ నరేణ సహితో బలీ
మానుషీం యోని మాస్థాయ చరిష్యతి మహీతలే
నరనారాయణౌ తౌ తు పురాణౌ ఋషిసత్తమౌ
అజేయౌ వారణేయౌ తౌ సమేతై రమరై రపి
సహితౌ మానుషే లోకే సంజాతా వమితద్యుతీ
మూఢా స్త్వేతౌ న జానంతి నరనారాయణౌ ఋషీ
యస్యాహ మాత్మజో బ్రహ్మా సర్వస్య జగతః పతేః
వాసుదేవోఽనుసేయో వః సర్వలోకమహేశ్వరః
తథా మనుష్యోఽయ మితి కదాచిత్సురసత్తమాః
నావజ్ఞేయో మహావీర్య శ్శంఖచక్రగదాధరః
ఏతత్పరమకం గుహ్య మేతత్పరమకం పదం
ఏతత్పరమకం బ్రహ్మ ఏతత్పరమకం యశః
ఏతదక్షర మవ్యక్త మేతచ్ఛాశ్వత మేవ చ
ఏతత్పురుషసంజ్ఞో వై గీయతే జ్ఞాయతే సదా
ఏతత్పరమకం తేజ ఏతత్పరమకం సుఖం
ఏతత్పరమకం సత్యం కీర్తితం విశ్వకర్మణా
తస్మాత్సురాసురై స్సర్వై స్సేంద్రై ర్హ్యమితవిక్రమః

నావజ్ఞేయో వాసుదేవో మానుషోఽయ మితి ప్రభుః
య శ్చ మానుషమాత్రోఽయ మితి బ్రూయా త్స మందధీః
హృషీకేశ మవజ్ఞానా త్త మాహుః పురుషాధమం
తం యోగినం మహాత్మానం ప్రవిష్ట మ్మానుషీం తనూం
యోఽవమన్యే ద్వాసుదేవం త మాహు స్తామసం జనాః
దేవం చరాచరాత్మానం శ్రీవత్సాంకం సువర్చసం
పద్మనాభం న జానాతి త మాహు స్తామసం జనాః

అనుశ్లోకములను బట్టి తెలిసికొనందగును.

శ్లో. బ్రహ్మోక్తం హరిపారమ్యం భారతే జయశబ్దవత్,
ఆహోఽహాని చతుర్థే తు గాంగేయో నిజపర్వణి. 90

తా. భీష్ముండు తన నాల్గవయుద్ధదినమున బ్రహ్మ పర మాత్మను చూచి,

శ్లో. జయ విశ్వ మహాదేవ జయ లోకహితే రత
అసంఖ్యేయగుణాధార జయ సర్వపరాయణ
నారాయణ సుదుష్పార జయ శార్ఙ్గధనుర్ధర

అను ౩౫ శ్లోకములనఱకు విష్ణుపారమ్యమును వెల్లడిచేసె ననెడి వృత్తాంతమును—

శ్లో. జామదగ్న్యస్య రామస్య మార్కండేయస్య ధీమతః
వ్యాసనారదయో శ్చాఽపి శ్రుతం శ్రుతివిశారద
మార్కండేయ శ్చ గోవిందం కథయ త్యద్భుతం మహత్
సర్వభూతాని భూతాత్మా మహాత్మా పురుషోత్తమః

అని వ్యాసనారద జమదగ్న్య మార్కండేయాదుల యొద్ద వింటి నని తెలిపెను.

శ్లో. విష్ణు మే వాస్మర ద్రోణః దేహత్యాగే తు నాగవాన్,
గతిం చ పరమాం యాస్యన్ భారతే ద్రోణపర్వణి. 91

తా. భగవంతుని విశ్వరూపసందర్శనమున [న్యమీలయంత రాజానః నేత్రాణి త్రస్తచేతసః] సమస్తరాజులు భయపడినవారై గట్టిగా కనులను మూసికొనిరి. అప్పుడెవరు యీ విరాట్పురుషుని విశ్వరూపమును సేవించినా రనఁగా,

ఋతే ద్రోణం చ భీష్మం చ విదురం చ మహామతిం
సంజయం చ మహాభాగం ఋషీం శ్చైవ తపోధనాన్

ద్రోణుఁడు భీష్ముఁడు విదురుఁడు సంజయుఁడు మహర్షులు వీరు సేవించిరి. వీరువినా అందఱు కనులను మూసికొనిరి. వీరిభక్తిని గుర్తెఱిఁగి"ప్రాదాత్తేషాం సభగవాన్ దివ్యం చక్షుర్జనార్దనః" తన్ను చూడఁతగిన దివ్యచక్షుస్సు నిచ్చెను. అనఁగా తనను సేవించుట తనఅనుగ్రహము లేక కలుగ దని భావము. అట్టి యీప్రకరణమందు, "ఋతేద్రోణ" మనేశ్లోకమున భారతభక్తులలో ప్రథమపురుషుఁడు అర్జునునకు విజయా యను పేరు కలుగుటకు దైవకారణ మెంతగనుండినను, లోకన్యాయముచే తనకుమారునికంటె అర్జునునకు సకలాస్త్రముల నిచ్చి పాండవ జయమునే దినదినంబునను నిత్యాహ్నికమువలె కోరుచున్న గురుగోత్రమం దుద్భవించిన కౌరవపాండవాచార్యుం డగుమహానుభావుఁ డగుద్రోణాచార్యులు తనయంతిమదశయందు—

శ్లో. ద్రోణోఽపి శస్త్రాణ్యుత్సృజ్య పరమం సాంఖ్య మాస్థితః,

తథోక్త్వా యోగ మాస్థాయ జ్యోతిర్భూతో మహాతపాః,
పురాణం పురుషం విష్ణుం జగామ మనసా పరం,

అనుశ్లోకములను బట్టి ఉత్తమ మైన జ్ఞానమును ఆశ్రయించి, సుషుమ్నా నాడీసంప్రదాయముతో ధనుర్విద్యయందు బాణమును గురితోఁ జేర్చుభంగిని—

శ్లో. ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే,
అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్.

అను కఠోపనిషత్తు నందలి పరబ్రహ్మ మగు లక్ష్యముతోఁ దనయాత్మ యను బాణమును ప్రణవముచే నితరమును గ్రహింపక విలువిద్యయందు తననేర్పరితనము వలె వేదాంతవిలువిద్య యందును ఆనేర్పరితనమును చూపెను. ఆపరబ్రహ్మను ఏపేరుతో నేరూపముతో ధ్యానించె ననఁగా విష్ణురూపముగ కడపటికాలమున ధ్యానించెను. ఇందుచే ద్రోణాచార్యుల జీవితకాలము విష్ణుభక్తివాడుకతో యుండె నని తెలియుచున్నది.

శ్లో. భారతే శాంతిపర్వస్థమోక్షధర్మే పునఃపునః,
నారాయణస్య పారమ్య మనన్యం ప్రోచ్యతే బహు. 92
శ్లో. య ద్బ్రహ్మ ఋషయ శ్చైవ స్వయం పశుపతి శ్చ యత్,
కృత్స్నం తు తస్య దేవస్య చరణా వుపతిష్ఠతే.

తా. భారతమున శాంతిపర్వమందు మోక్షధర్మ పర్వమున 344 అధ్యాయమున 60, 62 శ్లోకములను బట్టి బ్రహ్మ

రుద్రాదులతో కూడిన ప్రపంచమంతయు పరమాత్మ యగు నారాయణుని పాదములను అనుసరించి యున్నది యని తెలియుచున్నది.

శ్లో. పునఃపునః ప్రోచ్యతే చ భారతే బహువ్యాసు,
బ్రహ్మణ శ్శంకరస్యాఽపి జనకత్వం హరే రిహి. 93

తా. అరణ్యపర్వమున 12౦ అధ్యా. శ్లో. [illegible]

శ్లో. యుగా[illegible] [illegible]
బ్రహ్మ [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]

ఉద్యోగపర్వమందు అధ్యా. 129 :—

శ్లో. ఆస్యే బ్రహ్మలలాటస్థో రుద్రో వక్షసి చాఽనలః,

శాం. 122 అధ్యా. 12[illegible] :—

శ్లో. త మేనం బ్రహ్మణః పుత్ర మనుజాతం క్షుపం దదౌ,

శా. మోప. 340 అ. 50 :—

లలాటా చ్చైవ మే రుద్రో దేవక్రోధా ద్వినిస్సృతః

341 అ. శ్లో 78 :—

అస్య చైవాత్మజో రుద్రో లలాటా ద్య స్సముత్థితః.

342 శ్లో 17 :—

అహ్నాక్షయే లలాటాచ్చ సుతో దేవస్య వై తథా
క్రోధావిష్టస్య వై జజ్ఞే రుద్ర స్సంహారకారకః
ఏతౌ ద్వౌ విబుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధజౌ వుభౌ
తదాదేశితపంథానౌ సృష్టిసంహారకారకౌ
నిమిత్తమాత్రం తౌ వత్ర సర్వప్రాణివరప్రదౌ
కపర్ది జటిలో ముండః శ్మశానగృహసేవకః
ఉగ్రవ్రతధరో రుద్రయోగీ పరమదారుణః
దక్షక్రతుహర శ్చైవ భగనేత్రహర స్తథా
నారాయణాత్మకో జ్ఞేయః పాండవేయ యుగేయుగే.

343 అ. 97 :—

శ్లో. అహం ప్రసాదజ స్తస్య కుత శ్చిత్కారణాంతరే
త్వం చైవ క్రోధజ స్తాత పూర్వసర్గే సనాతనః

350 అధ్యా. 10 :—

శ్లో. లలాటప్రభవః పుత్రః శివ ఆగా ద్యదృచ్ఛయా.

351 అధ్యా. 20 :—

శ్లో. తస్మా జ్జాత స్త్వం చ మత్తః ప్రసూతః.

అను ప. 146 అధ్యా: —

శ్లో. బ్రహ్మా తస్యోదరభవః తథా చాహం శిరోభవః.

అను నీ ప్రమాణవచనములచేత బ్రహ్మరుద్రాదులు నారాయణునివలన జనించినా రని తెలియుచున్నది.

శ్లో. ఆనంద స్తు హరే శ్చైజః త దన్యేషాం తు కల్పితః,
ఇతి ప్రోక్తో భారతే తు రాజధర్మానుశాసనే. 94

తా. ఆనందము హరియగు పరమాత్మకొక్కనికే స్వాభావికము; అనఁగా ఒకరినిగురించి తపస్సు మొదలైనవాటిని జేసి సంప్రాప్తమైనది కాదు. వారికంటె ఇతరులకు తపస్సును యోగమును జేసి పరమపురుషుని అనుగ్రహమువలన సంప్రాప్తము కావలయును. ఇందుకు ప్రమాణము రాజధర్మానుశాసనమందు 20 వ అధ్యాయమున: —

శ్లో. మహాదేవ స్సర్వ మేధే మహాత్మా
హుత్వా ఽఽత్మానం దేవదేవో బభూవ
విశ్వాన్ లోకాన్ వ్యాప్య విష్టభ్య కీర్త్యా
విరాజతే కృత్తివాసాః పినాకీ.

అనుశ్లోకమందు పరమశివుఁడు సర్వమేధ మనుయాగమున తనతలను కోసి హోమము జేసి దేవదేవపట్టము తనకు కలిగినది అని వ్రాసినందునను, "మహాదేవేతపంథానా" అనువచనములనుబట్టియును, పరమశివునికి కల్పితానందమేయని తెలియుచున్నది.

శ్లో. శ్రియఃపతిం మాసిమాసి నానానామభి రచ్యుతం,
పూజయే దితి వ క్త్యేవ వ్యానుశాసనపర్వణి. 35

తా. అనుశాసనపర్వమందు 199అధ్యాయమున 3వ శ్లోకము మొదలు 14శ్లోకములవరకు విష్ణువును మార్గశీర్షమాసము మొదలు కార్తికమాసమువరకు 12 మాసములందు కేశవాది 12 నామములతో పూజింపవలయు నని వ్రాసియున్నది.

ఈపర్వమునందే విష్ణుసహస్రనామావళి వైష్ణవమయమై యున్నదని తెలియుచున్నది.

శ్లో. ఉచ్చైశ్శ్రవసూ రాజా నారాయణపరాయణః,
సంస్కృతః పాంచరాత్రేణ భారతే జ్ఞాయతే మహాన్. 96

తా. భా. శాం. మో. నారాయణీయపర్వమందు 335 వ అధ్యాయమందు ఉపరిచరవసుమహారాజు చాల నారాయణపరాయణుఁడుగా నున్నాఁడని [తస్య నారాయణ భక్తిం వహతో మిత్రకర్శిణః, ఏకశయ్యాసనం దేవో దత్తవాన్ దేవరాట్స్వయం] అను ప్రమాణమును బట్టి నారాయణభక్తి చేత దేవేంద్రుఁడు తనసింహాసనమందు కూర్చుండబెట్టుకొనెను అని [పంచరాత్రవిదో ముఖ్యాస్తస్య గేహే మహాత్మనః] పంచరాత్రశాస్త్రపరాయణులే వారింటియందు ముఖ్యముగ నుండిరి అని పాంచరాత్రశాస్త్రము శ్రీనారాయణునిచేత చేయబడినది గనుక ఉపరిచరవసురాజ్యమంతయు కృతయుగ లక్షణమువలె నారాయణపరాయణతతోనే నుండెననియు పాంచరాత్రవిధితోనే రాజ్యభారమును ఆ ఉపరిచరమహారాజు చేసెననియు, విశేషముగఁ దెలియుచున్నది; గాన కేవల నారాయణభక్తిమాత్రమే గాక పాంచరాత్రమందంతట తెలిపిన (కృతలక్షణ) తప్తముద్రాంకితులై యుండుట అందరికిని సూచారమని తెలియుచున్నది. అట్టి పాంచరాత్రప్రవర్తకులు భృగ్వత్రిమరీచికశ్యపాదులే అని నిస్సందేహముగ వ్రాసియు

న్నది. మఱియు పాంచరాత్ర ప్రవర్తకు లెవరనఁగా:—

శ్లో. మరీచి రత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః,
వసిష్ఠ శ్చ మహాతేజా స్తే హి చిత్ర శిఖండినః.

శాంతి. మోక్ష. అధ్యా-327—29 శ్లో.

అను శ్లోకమును బట్టి వీరికే సప్తశిఖండు లని పేరు. వీరే పాంచరాత్ర ప్రవర్తకులు. మఱియును,

శ్లో. యే హి తే ఋషయః ఖ్యాతా స్సప్త చిత్ర శిఖండినః,
తై రేక మతిభి ర్భూత్వా య త్ప్రోక్తం శాస్త్ర ముత్తమం.

శాం. మోక్ష. అధ్యా 337—26 శ్లో.

శ్లో. వేదై శ్చతుర్భి స్సమితం కృతం మేరౌ మహాగిరౌ,

అను వచనములను బట్టి ఈ సప్తర్షులచేత బహిరంగ పరచఁబడిన పాంచరాత్రశాస్త్రము నాలుగు వేదములకు సమానమైన దని వ్రాసియున్నది. ఈ మహర్షులు శ్లో. ఆరాధ్య తపసా దేవం హరిం నారాయణం ప్రభుం. (శ్లో. 33) అను వచనమునుబట్టి నారాయణునిగుఱించి తపస్సు చేయఁగా.—

శ్లో. నారాయణానుశిష్టా హి తదా దేవీ సరస్వతీ,
వివేశ తా నృషీన్ సర్వాన్ లోకానాం హితకామ్యయా.

అను వచనములచేత భగవంతుని ఆజ్ఞవలన సరస్వతీదేవి ఆఋషులముఖమునఁ బ్రవేశించి, నారాయణప్రోక్త పాంచరాత్ర శాస్త్రమును బయలుపఱచునటులఁ జేసెను. అదియునుఁగాక,

శ్లో. తతః ప్రసన్నో భగవాన్ అనిర్దిష్ట శరీరగః,
ఋషీ నువాచ తాన్ సర్వాన్ అదృశ్యః పురుషోత్తమః.

కృతం శతసహస్రంహి శ్లోకానా మిద ముత్తమం,
లోకతంత్రస్య కృత్స్నస్య యస్మా ద్ధర్మః ప్రవర్తతే.
ప్రవృత్తౌ చ నివృత్తౌ చ యస్మా దేవ భవిష్యతి,
యజుర్ ఋక్సామభి ర్జుష్ట మథర్వాంగిరసై స్తథా.
యథాప్రమాణం హి మయా కృతో బ్రహ్మప్రసాదతః,
రుద్రశ్చ క్రోధజో విప్రాః యూయం ప్రకృతయ స్తథా.
సూర్యాచంద్రమసౌ వాయుః భూమి రాపోగ్ని రేవ చ,
సర్వే చ నక్షత్రగణాః యచ్చ భూతాభి శబ్దితం.
అధికారేషు వర్తంతే యథా స్వం బ్రహ్మవాదినః,
సర్వే ప్రమాణం హి యథా తథా తచ్ఛాస్త్ర ముత్తమం.
భవిష్యతి ప్రమాణం వై ఏత న్మదనుశాసనం,
తస్మా త్ప్రవక్ష్యతే ధర్మాన్ మను స్స్వాయంభువ స్స్వయం.
ఉశనా బృహస్పతి శ్చైవ యదోత్పన్నౌ భవిష్యతః,
తదా ప్రవక్ష్యత శ్శాస్త్రం యుష్మన్మతిభి రుద్ధృతం.
స్వాయంభువేషు ధర్మేషు శాస్త్రే చోశనసా కృతే,
బృహస్పతిమతే చైవ లోకేషు ప్రతిచారితే.
యుష్మత్కృత మిదం శాస్త్రం ప్రజాపాలో వసు స్తతః,
బృహస్పతిసకాశా ద్వై ప్రాప్స్యతే ద్విజసత్తమాః.
స హి సద్భావితో రాజా మద్భక్త శ్చ భవిష్యతి,
తేన శాస్త్రేణ లోకేషు క్రియా స్సర్వాః కరిష్యతి.
ఏత ద్ధి యుష్మ చ్ఛాస్త్రాణాం శాస్త్ర ముత్తమసంజ్ఞితం,
ఏత దర్థ్యం చ ధర్మ్యం చ రహస్యం చైత దుత్తమం.
అస్య ప్రవర్తనా చ్చైవ ప్రజావంతో భవిష్యథ,
స చ రాజా శ్రియా యుక్తో భవిష్యతి మహాన్ వసుః.
సంస్థితే చ నృపే తస్మిన్ శాస్త్ర మేత త్సనాతనం,

అంతర్ధాస్యతి తత్పూర్వ మేతద్వః కథితం మయా.
ఏతావదుక్త్వా వచన మదృశ్యః పురుషోత్తమః,
విసృజ్య తా నృషీన్ సర్వాన్ కామపి ప్రస్థితో దిశం.

అను నీ వచనములను బట్టి, ఈ సప్తర్షుల ముఖముల నుండి ప్రాదుర్భవించిన నారాయణప్రోక్త పాంచరాత్రశాస్త్రము, ఋగ్యజుస్సామవేదములతో సమానమైనది యని, దీని ననుసరించియే మనువు ధర్మశాస్త్రమును చేయు నని, ఈశాస్త్రము చేతనే ఉపరిచరవసుమహారాజను రాజ్యతంత్రమును చేయునని, అతఁడు తనకు చాల భక్తుఁడగు నని, బ్రహ్మాదిదేవతలు ఆయా అధికారములతోఁ బ్రవర్తించుట కెట్లుప్రమాణమో, అటులనే యీ పాంచరాత్రశాస్త్రమును ప్రమాణమని, శ్రీ నారాయణుఁడు ఆసప్తర్షుల కానతిచ్చి అంతర్ధానుఁ డాయెను.

కావున నుపరిచరవసుమహారాజు నారాయణపరాయణుఁడనియు, పాంచరాత్రప్రమాణైకశరణుఁ డనియు, పాంచరాత్ర ప్రతిపాదితతప్తముద్రాధారణాద్యారాధకలక్షణవిలక్షణుఁడనియు, తన దేశమం దెచ్చటను పై సప్తర్షులసంప్రదాయభంగిన శిఖాయజ్ఞోపవీతములవలె తప్తముద్రాద్యాచారప్రవర్తకుఁ డనియు, ఘంటాపథముగఁ దెలియుచున్నది.

ఇట్లు భారతము అన్ని దేశములందును వ్యాపించి అనేకములగు భాషలలో అనేకవిధము లగు తర్జుమాలతో విస్తరించి, నానాభాషావేత్తలచేతఁ బ్రతీతిఁగాంచి, తనలో నున్న

గీతా సహస్రనామ స్తవరాజము లనెడి రత్నాలంకారములచే మించి, ప్రపంచముకంటెను గొప్పదనఁబడిన యీ పంచమవేద మందు, పాంచరాత్రము అందలి తప్తముద్రాధారణాద్యాచార ములు, తత్ప్రివర్తకు లగు మరీచ్యత్రి కశ్యపాదులు అని వివర ముగను, విస్తారముగను, విశేషముగను తెలియుచుండఁగా, తప్తముద్రాధారణమును మా మరీచి నిషేధించినాఁడని, అచ్చు లేక హెచ్చులేక నోటికివచ్చినట్లు ముచ్చటలాడి ప్రొద్దుపుచ్చు కొనెడి నచ్చువచనములను ఆసంఘములవారిలోను కొందఱు మాత్రమే బయలువరచుట హాస్యాస్పదమే యగును. భగవదా రాధనాక్రమ ప్రతిపాదకము లగు శ్రీ వైఖానస పాంచరాత్ర శాస్త్రములు రెండును సమానతంత్రములే యగు నని శ్రీ వేదాంతాచార్యులవారు తమ గ్రంథములందు వెల్లడిచేసి యున్నారు. భగవదర్చకులకు తప్తచక్రాంకనము యీ రెండు శాస్త్రములందు ప్రసిద్ధమైనయంశము. ఇందుకు వ్యక్తమైన ప్రమా ణగ్రంథము వైఖానసకాశ్యపముని హారీతస్మృతి యని సుద ర్శనవైభవమునను వ్రాసియున్నాను. శ్రీ వైఖానసులలో తప్తచక్రాంకన ధారణాద్యాచారమును కొందఱు కలివలన వదలినను, పండితశిరోమణు లగు తిరుపతిచక్రవర్తి భట్టాచా ర్యులవారు, యలమాసూరుకోట గ్రామమందలి ప్రాచీనులగు ఆచార్యపురుషులగు దేవరాజభట్ట రనువారొకరు, ముక్తిపురి అగ్రహారము మొదలగు అనేక గ్రామములందు వేంచేసియుండే

అల్లూరు వేంకటప్పలాచార్యులువారు, ఈ మొదలగువారు అనేకులు పరంపరగా హారీతాద్యాచారరీతితో వర్తిల్లు చున్నారు.

ఇదియునుగాక, వైఖానసపాంచరాత్రములు రెండును సంపూర్ణముగ విష్ణుపారమ్య ప్రతిపాదకములే యగును. ఈ రెండును పరమవైదికము లైనందున, వేదమందు దేవతాంతర ప్రాశస్త్య పరములగు మంత్రములుండిన భంగివలె నిచ్చటను అంగదేవతా ప్రాశస్త్యమగుటచేత, అంగి యగు నారాయణుని ప్రాశస్త్యమందే అన్వయించును.

ఒకసూత్రమందు లేనియాంశమును ధర్మశాస్త్రమందు తెలిపిన విశేషాచార మైనయెడల, తనసూత్రమందు ప్రత్యవాయము చెప్పనియెడలను, ఇతరసూత్రమునుండి గ్రహించవచ్చునుగదా ! కావున శ్రావణమందు బ్రహ్మచారుల క్షౌరము వైఖానస సూత్రమందుండి గ్రహించిన దని వైదిక సార్వభౌములు వైద్యనాథదీక్షితులు వ్రాసియున్నారు. ఏసూత్రమందైనను సంపూర్ణోపదేశ ముండదుగదా! అట్లుగాక అది వారు చేసినది, ఇది వీరు చేసిన దని కొందఱు విజ్ఞాపింతురు. అది తగదు. వైఖానసులకును ఇతర సూత్రములనుండి వచ్చెడి యంశము దత్తస్వీకారవిధి యని తెలియదగు. అటులనే తప్తముద్రాధారణ ప్రక్రియయును, తమసూత్రోప బృంహణములందు లేనియంశము కాదు. లే దని వారెంచినను, అన్యతో గ్రాహ్యము కావచ్చును.

తప్తముద్రాధారణప్రక్రియ వైఖానస పాంచరాత్రములందు సమానముగఁ బ్రతిపాదింపఁబడిన దైనందున, మరీచికశ్యపాదులు ఒకచోట ప్రవర్తకులును, మఱియొకచోట నివర్తకు లనెడి మతాంతరదూషణలకు పాత్రులు కారు.

శ్లో. సంజయో వ్యాస శిష్య స్తు వేత్తి వక్తి జనార్దనం,
పరమాత్మేతి లోకానాం నేతే త్యుద్యోగపర్వణి. 97

తా. ఉద్యోగపర్వమందు యానసంధిపర్వమున 68-వ అధ్యాయములో—

శ్లో. కథం త్వం మాధవం వేత్థ సర్వలోక మహేశ్వరం,
కథ మేనం న వేదాఽహం త న్మమాచక్ష్వ సంజయ.

దిక్పాలులకును ఈశ్వరుఁడైన శ్రీకృష్ణుని నీ వెట్లు తెలిసికొనుచున్నావు? నేను ఎట్లు తెలిసికొనలేదు. నాకు ఏల తెలియలేదు.—అని ధృతరాష్ట్రుఁడు సంజయుని చూచి, యడిగెను. అందుకు సంజయుఁడు—

శ్లో. శృణు రాజ న్న తే విద్యా మమ విద్యా మహీయతే,
విద్యాహీన స్తమోధ్వస్తో నాభిజానాసి కేశవం.

ఓ ధృతరాష్ట్రమహారాజా! నీకు బ్రహ్మవిద్య లేదు. నాకు గురూపదిష్టమగు బ్రహ్మవిద్య గొప్పగా నున్నది. నీకు ఆవిద్య లేనందున నజ్ఞానాంధకారముచే నణంగినవాఁడవై, పరమాత్మ యగు కేశవుని తెలిసికొనఁజాలవు—అని బదులొసంగెను. అప్పుడు, మఱల ధృతరాష్ట్రుఁడు—

శ్లో. గావల్గణేఽత్ర కాభక్తిః యా తే నిత్యం జనార్దనే,
యథా త్వ మనుజానాసి త్రియుగం మధుసూదనం.

ఓ సంజయా! జనార్దనునియందు ఎల్లప్పుడు నీకున్న భక్తి యేది? నడచుచున్న ఈ యుగముతో సహా మూఁడు యుగములందును ప్రకాశించుచున్న పరమాత్మను నీవెట్లు తెలిసికొనుచున్నావు? అని యడిగెను. ఇచ్చట—త్రియుగం= జ్ఞానబలైశ్వర్యవీర్య శక్తి తేజస్సులగు మూఁడు జతలైన ఆఱు గుణములు గల పరమాత్మ యని ఈ పదమునకు తాత్పర్యము. అందులకు సంజయుఁడు

శ్లో. మాయాం న సేవే భద్రం తే న వృథా ధర్మ మాచరే,
శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రా ద్వేద్మి జనార్దనం.

ఓ ధృతరాష్ట్రా! నేను అజ్ఞానముచే విపరీతజ్ఞానకార్యమును చేయను. జ్ఞానస్వరూప మగు ఆత్మకు ప్రయోజనము లేని దేహ మాత్రోపయుక్త మగు పనిని చేయను. పరమాత్మయందు శుద్ధభావముతోఁ గూడినవాఁడనై, పరమాత్మయందలి ప్రేమ చేత సర్వోపనిషచ్ఛాస్త్ర నిర్ణయమువలన పరమాత్మ యగు శ్రీకృష్ణుని తెలిసికొనుచున్నాను—అని బదులు చెప్పెను. అట్టి సంజయుని అచ్చటనే యున్న వేదవ్యాసులు

శ్లో. జానా త్యేష హృషీకేశం పురాణం యం చ వై పరం,
శుశ్రూషమాణ మేకాగ్రం మోక్ష్యతే మహతో భయాత్.

అని—అయ్యా! ధృతరాష్ట్రా! ఈ సంజయుఁడు ప్రాచీనుఁడైనవాఁడును, సకలకల్యాణగుణ పరిపూర్ణుఁడును నగు

పరమాత్మను చక్కఁగా తెలిసికొనుచున్నవాఁడు. ఏకాగ్రము గ జాగరూకుఁడవై, తత్త్వమును వినఁగోరినయెడల, అట్టి నీకు తత్త్వపురుషార్థమును చెప్పి సంసారభయమునుండి నిన్ను విడుదల చేయును—అని చెప్పి సంజయునికిఁగల జ్ఞానభక్తి వైరాగ్యములను తెలియంజేసెను. కావున సంజయుఁడు పరమవిష్ణుభక్తుఁడనుటకు సందేహ మేమియు లేదు.—విష్ణుభక్తుఁ డైనందుననే త్రైవర్ణికాధికారముతో నున్న బ్రహ్మవిద్య, సంజయుని ఆశ్రయించియున్న దని తోఁచుచున్నది.

శ్లో. దేవతేజోర్ధబలినః హరి రాత్మా హరస్య సః,
అదాహయత్ పురాణీతి జ్ఞాయతే కర్ణపర్వణి. 98

అహ మేతాః హనిష్యామి యుష్మత్తేజోర్ధ బృంహితః.

అను శ్లోకమునుబట్టి [క. ప. 35-వ అ. శ్లో. ]త్రిపురాసుర సంహారమును పరమశివుఁడు అఖిలదేవతలయొక్క శక్తియందు సగముసగము శక్తిని తనలోఁ జేర్చుకొనిగాని, శత్రువులను సంహారము చేయనోప నని చెప్పెను. కనుక నప్పుడు వా రందఱితేజస్సును చేర్చుకొని సంహరించినట్లు తెలియుచున్నది. ఇదియునుంగాక.—

శ్లో. విష్ణు రాత్మా భగవతః భవస్యామి తతేజసః. (శ్లో. 49.)

అని చెప్పినందునఁ బరమశివునికిని విష్ణువు ఆత్మయే యని పరమశివుఁడు దేహమువలె విధేయుఁడని వ్రాసియున్నది. ఇందుచేతనే శంకరభాష్యమందు ఉద్దాలకాంతర్యామివిద్య

యందలి సర్వాంతర్యామిత్వము నారాయణునికే పేరుపెట్టి వ్రాసియున్నది.

"య ఈదృగీశ్వరో నారాయణాఖ్యః పృథివీం పృథివీ దేవతాం యమయతి నియమయతి." (శంకరభా. బృ. అ. 3.) అని చెప్పుటచేత విష్ణువు పరమశివునికి ఆత్మగా నుండి, శివుని నియమించుచు బాణముగానుండి త్రిపురసంహారమును గావించెను. కాన త్రిపురసంహారవిజయమందు దేహమువలె పరమశివుఁ డుండెను. దేహనియామకుఁడైన ఆత్మవలె విష్ణువుఁడున్నట్లు 49-వ శ్లోకముచేత సిద్ధాంతము చేయఁబడయును. కార్యకర్తృత్వము దేహమునకు, నియామకకర్తృత్వము దేహికి ఉన్నదానివలె గమనింపుడు. ఇందుచేత, 'న హి నిందాన్యాయ' ప్రకారము శివుని నిందించుటకు ప్రయత్నించినవాఁడను గాను శివకేశవుల ప్రభావ తారతమ్యమును బోధించినాఁడను. ఇట్లు భారతమందు.—

శ్లో. ఆదౌ మధ్యే తథాన్తే చ విష్ణు స్సర్వత్ర గీయతే.

అను భారతశ్లోకమును బట్టి భారతమంతయు వైష్ణవమని తెలియందగు.

శ్లో. శివకేశవయో ర్యోగే శివస్తోతా ద్ధరి స్తవః,
పరమః ఖలు విజ్ఞేయః కారణత్వ ప్రదర్శనాత్. 99

తా. కైలాసమందు శివకేశవులు సంధించినపుడు శివుని గుఱించి కృష్ణుఁడు అవతారమర్యాద ననుసరించి కొనియాడెను. ఆ స్తోత్రమును గమనింపుడు.—

శ్లో. నమ స్తే శితికంఠాయ నీలగ్రీవాయ వేధసే,
నమ స్తే శోచిషే అస్తు నమ స్తే ఉపవాసినే.
నమ స్తే మీఢుషే అస్తు నమ స్తే గదినే హర,
నమ స్తే విశ్వతనవే వృషాయ వృషరూపిణే.
అమూర్తాయ చ దేవాయ నమ స్తేఽస్తు పినాకినే,
నమః కుబ్జాయ కూప్యాయ శివాయ శివరూపిణే.
నమ స్తుండాయ తుష్యాయ నమ స్తుటితుటాయ చ,
నమ శ్శివాయ శాంతాయ గిరిశాయ చ తే నమః.
నమో హరాయ విప్రాయ నమో హరిహరాయ చ,
నమోఽఘోరాయ ఘోరాయ ఘోరఘోరప్రియాయ చ.
నమోఽఘంటాయ ఘంటాయ నమో ఘటిఘటాయ చ,
నమ శ్శర్వాయ శాంతాయ భూతాధిపతయే నమః.
నమో విరూపరూపాయ పురాయ పురహారిణే,
నమ ఆద్యాయ విజ్ఞాయ శుచయేఽష్టస్వరూపిణే.
నమః పినాకహస్తాయ నమ శ్శూలాసిధారిణే,
నమః ఖట్వాంగహస్తాయ నమ స్తే కృతివాసనే.
నమ స్తే దేవదేవాయ నమ ఆకాశమూర్తయే,
హరాయ హరిరూపాయ నమ స్తే తిగ్మతేజసే.
భక్తిప్రియాయ భకాయ భక్తానాం వరదాయినే,
నమోఽభ్రమూర్తయే దేవ జగన్మూర్తిధరాయ చ.
నమ శ్చంద్రాయ దేవాయ సూర్యాయ చ నమో నమః,
నమః ప్రధానదేవాయ భూతానాం పతయేనమః.
కరాళాయ చ ముండాయ వికృతాయ కపర్దినే,
అజాయ చ నమ స్తుభ్యం భూతభావన భావన.
నమోఽస్తు హరికేశాయ పింగళాయ నమో నమః,
నమ స్తే భీషహస్తాయ భీరుభీతి హరాయ చ.

హరాయ భీతిరూపాయ ఘోరాణాం భీతిదాయినే,
నమో దక్షమఖధ్వంసాయ భగనేత్రాపహారిణే.
ఉమాపతే నమ స్తుభ్యం కైలాసనిలయాయ చ,
ఆదిదేవాయ దేవాయ భవాయ భవరూపిణే.
నమః కపాలహస్తాయ నమో యమభయానక,
త్ర్యంబకాయ నమ స్తుభ్యం త్ర్యక్షాయ చ శివాయ చ.
వరదాయ వరేణ్యాయ నమ స్తే చంద్రశేఖర,
నమ ఇధ్మాయ హవిషే ధ్రువాయ చ కృశాయ చ.
నమ స్తే శక్తియుక్తాయ నాగపాశప్రియాయ చ,
విరూపాయ సురూపాయ భద్రగానప్రియాయ చ.
శ్మశానరతయే నిత్యం జయశబ్దప్రియాయ చ,
ఖరప్రియాయ ఖర్వాయ ఖరాయ ఖరరూపిణే.
భద్రప్రియాయ భద్రాయ భద్రరూపధరాయ చ,
విరూపాయ సురూపాయ మహాఘోరాయ తే నమః.
ఘంటాయ ఘంటభూషాయ ఘంటాభూషణభూషిణే,
తీవ్రాయ తీవ్రరూపాయ తీవ్రరూపప్రియాయ చ,
నగ్నాయ నగ్నరూపాయ నగ్నరూపప్రియాయ చ.
భూతావాస నమ స్తుభ్యం సర్వావాస నమో నమః,
నమ స్సర్వాత్మనే తుభ్యం నమ స్తే భూతినాయక.
నమ స్తే వామదేవాయ మహాదేవాయ తే నమః.

అని యీస్తోత్రము నిట్టుల కృష్ణుఁడు శివునిగురించి చేసెను. ఇఁకను ఇట్లే శివుఁడు కృష్ణునిగుఱించి చేయు స్తోత్రమును గమనింపుఁడు. మహేశ్వరః:—

శ్లో. యత్తత్ కారణ మాహు స్తత్ సాంఖ్యాః ప్రకృతిసంజ్ఞకం,
త్రిధా భూతం జగద్యోనిప్రధానం కారణాత్మకం.

బృహత్త్వా ద్బృంహణత్వాచ్చ తస్మా ద్బ్రహ్మేతి శబ్దితః,
మధు గిం ద్రియ నామేతి తతో మధునిషూదనః.
హృషీ ణా ణీంద్రియా ణ్యాహుః తేషా మీశో యతో భవాన్.
హృషీకేశ స్తతో విష్ణో ఖ్యాతో దేవేషు కేశవ.
క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినాం,
ఆవాం తవాంగసంభూతౌ తస్మా త్కేశవనామవాన్.
మా విద్యా చ హరే ప్రోక్తా తస్యా ఈశో యతో భవాన్,
తస్మా న్మాధవనాఽమాసి భవ స్స్వామీతి శబ్దితః.
గౌ రేషా శ్రూయతే వాణీ తాం చ వేద యతో భవాన్,
గోవింద స్త్వం తతో దేవః మునిభిః కథ్యతే భవాన్.
త్రి రి త్యేవ త్రయో వేదాః కీర్తితా మునిసత్తమైః,
క్రమతే తాం స్తథా సర్వాన్ త్రివిక్రమ ఇతి స్మృతః.
అణు ర్వామననామాఽసి యత్త స్త్వం వామనాఖ్యయా,
మనసా న్మని రేవాఽసి యమనా ద్యతి రుచ్యతే.
తప శ్చేరసి యస్మా త్త్వం తపస్వీతి చ శబ్దితః,
వసంతి త్వయి భూతాని భూతావాస స్తతో హరే!
ఈశ స్త్వం సర్వభూతానాం ఈశ్వరోఽసి తతో హరే!
ప్రణవ స్సర్వవేదానాం గాయత్రీ ఛ్ఛందసాం ప్రభో!
అక్షరాణా మకార స్త్వం స్ఫోట స్త్వం వర్ణసంశ్రయః,
రుద్రాణా మహ మేవాఽసి వసూనాం పావకో భవాన్.
అశ్వత్థో వృక్షజాతీనాం— ఇత్యాది.

కృష్ణోఽంతరాత్మే త్యూచే యః స జ్ఞానీ విదురాఖ్యయా,
స విష్ణుదర్శీ తస్యాన్నం బుభుజే సంధిగో హరిః. 100

తా. భారతమందు విదురుఁడని పేరొందిన్న మహానుభా
వుఁడు.—

శ్లో. సఏవ భక్తస్సగురుః స భర్తా,
స వై పితా స చ మాతా సుహృచ్చ.
అగాధబుద్ధిః విదురో దీర్ఘదర్శీ,
స నో మంత్రీ ప్రశాంతం స్మ పృచ్ఛేః.

అను శ్లోకమందు విదురుని యోగ్యత యెంతయు ధర్మరాజుచేఁ గొనియాడఁబడినది. విదురుఁడను శబ్దమునకు జ్ఞానవంతుఁడని యర్థము ఇట్టివిదురుని ధర్మశాస్త్రకర్తలవలె నొకనినిగా పరాశరమాధవీయమునందు మొదటిఅధ్యాయమున 20 శ్లోకవ్యాఖ్యానప్రకరణమున:—

శ్లో. తథా విదురవాక్యాని భృగోరంగిరస స్తథా-

అను భారతశ్లోకమును చూపి కొనియాడెను. అట్టియీ విదురుఁడు సంధిపర్వమున శ్రీకృష్ణుని చూచి,

శ్లో. యామే మతిః పుష్కరాక్ష త్వద్దర్శనసముద్భవా,
సాం కి మాఖ్యాయతే తుభ్యం అంతరాత్మాఽసి దేహినాం.

శ్రీకృష్ణా! నిన్ను చూచినందువలన కలిగిన తృప్తి నేనేమని నీకు తెలుపుదును. ఆయా దేహమందు జీవుఁడుండిన జీవుని కెట్లు తృప్తియో అటులనే సమస్తజీవులకు నీవంతరాత్మవుకదా! శరీరము జీవునికి విధేయమైనను, తృప్తిపొందినట్లు జీవులు నీకు విధేయులైనను నీవే తృప్తికరుఁడవు గాన నీవు నియామకుఁడవు. ఆధారభూతుఁడవు—అని విదురుఁడు విష్ణుతత్త్వమును హ్యా... కేశతత్త్వమును ప్రకటించినాఁడు. ఇచ్చట—'అంతరాత్మాఽసి దేహినాం' అనుటచే బ్రహ్మాదులకును ఈ

తనే 'అంతర్యామి యని' తీర్మానించినాఁడు. ఇందుకు సాక్ష్యము బృహదారణ్యమున ఉద్దాలకాంతర్యామి విద్యయందలి శంకరభాష్యమువల్ల తెలియందగు. శ్రౌతవైష్ణవమందు తెలిపియే యున్నాను. ఇటులనే కుంతియును

శ్లో. తస్యాం స సని సర్వేషాం క్షత్తారం పూజయా వ్యహం.

ఉ-పర్వ. 89 అధ్యా. 50-శ్లో.

లను శ్లోకమునఁ గొనియాడఁబడినది. కాన ఇట్టి ఉత్తమపురుషుఁడగు విదురుని శ్రీకృష్ణుఁడును—

శ్లో. క్షత్తు రేవాస్య భోక్తవ్య మితి మే ధీయతే మతిః.

విదురుని యింటమాత్రము భుజించవలయు నని నామతి నిశ్చయించినది.

శ్లో. విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ.

అను 42-వ శ్లోకమందు భక్తిచే నుత్తమమైన అన్నమును శ్రీకృష్ణుఁడు విదురునియింట భుజించి నివసించెను. కావున శ్రీకృష్ణవిదురుల పరస్పరప్రియము వ్యక్తమైనది. ఈ విదురుఁడు శ్రీకృష్ణుని తత్త్వమును ప్రవచించునపుడు పూర్వమందు శ్రీకృష్ణుఁడు సముద్రమందు శయనించి, మధుకైటభు లనెడి ఆదిరాక్షసులను చంపెను. హయగ్రీవు డనెడి రాక్షసునిగూడ చంపెను. అట్టి శ్రీకృష్ణుని ప్రభావము నీకు తెలియదు అనెను.

శ్లో. ఏకార్ణవే చ స్వపతా నిహతౌ మధుకైటభౌ,
జన్మాంతర ముపాగమ్య హయగ్రీవ స్తథా హతః. 129-అ.

అను వచనములచే తెలియుంగాన, గాన విదురుఁడు స్వభావముగా విష్ణుభక్తుఁడని వ్యక్తము.

శ్లో. మహాభారతకృద్వ్యాసః సూత్రస్మృతి పురాణకృత్,
నారాయణాంశతో జాతః వేదార్థ ఖ్యాపనాయ హి. 101

టీ. మహాభారతమును, బ్రహ్మసూత్రములను, తనపేరున స్మృతిని, పురాణములను చేసినవారు వేదవ్యాసులు. వీరు సారస్వతియను మధ్యవించి అపాంతరతముఁ డనెడిపేరుతో ప్రసిద్ధికెక్కి కృష్ణావతారకాలమందు వేదవ్యాసులుగా అవతరించిరి.

శ్లో. సోఽహం తస్య ప్రసాదేన దేవస్య హరిమేధసః,
అపాంతరతమా నామ జాతో ఽస్యాజ్ఞయా హరేః.
పున శ్చ జాతో విఖ్యాతః వసిష్ఠ కులనందనః,
త దేత త్కథితం జన్మ మయా పూర్వక మాత్మనః.
నారాయణ ప్రసాదేన తథా నారాయణాంశజః.

అను శ్లోకములంబట్టి నారాయణుని ఆజ్ఞచేతను నారాయణాంశతోను, విష్ణుపురాణకర్త యగు పరాశరులకు పాంచరాత్ర పరాయణుఁడగు ఉపరిచరవసుమహారాజువారి కుమార్తెయు నైన మత్స్యగంధికి కృష్ణద్వైపాయనుఁ డనుపేరుతోడ ప్రాదుర్భవించెను. ఈ వేదవ్యాసులు వేదవిభాగమునకు నేక వేదాంతములందలి సందేహములను తీర్చుటకై, వేదాంతసూత్రము లనుపేర 545 సూత్రములను 56 అధికరణములను 16 పాదములతో 4 అధ్యాయములతో విరచించిరి. ఈసూత్రములందు ఉపాస్యుఁడగు పరబ్రహ్మము శ్రీమన్నారాయణుఁడే యని

శంకర రామానుజ పూర్ణప్రజ్ఞాచార్యులను మత్రయాచార్యుల యభిప్రాయములను ఆయా వచనములతో నిదివఱకే నిరూపించితిని. భారతమంతయు వైష్ణవ మని వ్యాస, సూత, పౌరాణికాదుల వక్కాణలే వ్యక్తముగ ఆదిమధ్యాంతములందు గానంబడు చున్నవి.

శ్లో. యామిన్యాశ్ పశ్చిమే యామే త్యక్తనిద్రో హరిం స్మరేత్.

అని తన స్మృతియందు వైష్ణవమును తానే వివరించియున్నాఁడు. పురాణములందలి సిద్ధాంత మెట్లనగా సాత్వికపురాణములందును, విష్ణుపారమ్యమే తెలియుచున్నది. ఇదియుఁగాక.

శ్లో. యదీ హాస్తే త దన్యత్ర య న్నేహాఽస్తే న త త్క్వచిత్.

అనువచనముచే పూర్వపూర్వము బలీయ మగుటవలవ, ఇతిహాసములకు విరుద్ధముగ పురాణవచనముల కర్థము చెప్పకూడదు. ధర్మశాస్త్రములకు విరుద్ధముగ ఇతిహాసాభిప్రాయములను తెలుపగూడదు. వేదవేదాంతములకు విరోధముగ స్మృత్యభిప్రాయ ముండకూడ దని తెలియుచున్నది. అయితే అట్లు పరస్పరవిరోధముగ గ్రంథకర్త యేల చేయవలయుననఁగా—తత్తదేవతాప్రాశస్త్యముకై అట్లువ్రాసినా రని భావము. కావున వేదవ్యాసులు విష్ణుపారమ్యబోధకులే యగుదురు 3ి1 అధ్యాయమున 90

శ్లో. తం దేవో దర్శయామాస కృత్వా హయశిరో మహత్
సాంగా నావర్తయన్ వేదాన్ కమండలు త్రిదండధృత్
తతోఽశ్వశిరసం దృష్ట్వా తం దేవ మమితౌజసం
లోకకర్తా ప్రభు ర్విష్ణు ర్లోకానాం హితకామ్యయా
మూర్ధ్నా ప్రణమ్య వరదం తస్థౌ ప్రాంజలి రగ్రతః
కథితం తచ్చ వై సర్వం మయా పృష్టేన తత్వతః
క్రియతాం మద్వచ శ్శిష్యాః సేవ్యతాం హరి రీశ్వరః
గీయతాం వేదశబ్దై శ్చ పూజ్యతాం చ యథావిధి.

అనువచనములచేత వేదవ్యాసులు సుమంతుజైమినిపైల వైశంపాయను లగు నలుగురి శిష్యులకును తనకొమారుఁడగు శుకమహామునికిని హరిభక్తి చేయుమని బోధించెను. హయగ్రీవుల ధ్యానశ్లోకముల సప్తకమును ఉపదేశించెను. అని వ్రాసియున్నది గాన వ్యాసులకు వ్యాసపరాశరులకు వైష్ణవము సిద్ధమే యగును. శుకోత్పత్తియందు శివసంబంధము తెలియుచున్నది. 'శంకరాత్ జ్ఞాన మన్విచ్ఛేత్' అనెడి వచనమును బట్టి విష్ణుభక్త్యుద్రేకమునకు ఘంటాకర్ణునికివలె అంగమగును.

యీయధ్యాయ మంతయు ఆస్తికులు వినినచో విష్ణుభక్తికి ఉపదేశకు లగుదురు.

శ్లో. ముక్తి ప్రద స్సర్వ త్సర్వేషాం విష్ణు రేవ న సంశయః,
ఇతి ఘంటాకర్ణ మాహ హరివంశే తు శంకరః, 102

అ. భారతమందలి హరివంశపర్వమందు భవిష్యత్ పర్వమున కృష్ణుఁడు కైలాసమునకు పోవుమార్గమునందు:—

278-వ అధ్యా. 27-వ శ్లోకము.

శ్లో. సతతం దూషయన్ విష్ణుం ఘంటా మాబధ్య కర్ణయోః
మమ న ప్రవిశేన్నామ విష్ణో రితి విచింతయన్
అహం కైలాసనిలయ మాసాద్య వృషభధ్వజం
ఆరాధ్య తం మహాదేవ మస్తువ సతతం శివం
తతః ప్రసన్నో మా మాహ వృణీష్వేతి వరం వరః
తతో ముక్తిర్మయా తత్ర ప్రార్థితా దేవసన్నిధౌ
ముక్తిం ప్రార్థయమానం మాం పున రాహ త్రిలోచనః
ముక్తిప్రదాతా సర్వేషాం విష్ణు రేవ న సంశయః
తస్మా ద్గత్వా చ బదరీం తత్రాఽఽరాధ్య జనార్దనం
ముక్తిం ప్రాప్నుహి గోవిందా న్నరనారాయణాశ్రమే
ఇత్యుక్త్వా దేవదేవేన శూలినాఽజ్ఞాతవా నహం
తమేవ వరమం మత్వా గోవిందం గరుడధ్వజం
తస్మా త్ప్రార్థయమాన స్సన్ముక్తిదేశ మిమం గతః.

అనుశ్లోకములనుబట్టి ఘంటాకర్ణుఁడను విష్ణుద్వేషకుఁడును కేవలశివభక్తుఁడు విష్ణునామము చెవులతో వినకూడదని రెండుచెవులలో ఘంటలను కట్టుకొని శివపూజను సదా చేయుచునుండి, ఒకానొక కాలమున కైలాసమున కేగి పరమశివుని ప్రార్థింపఁగా, అతను నితనిభక్తికి మెచ్చి నీకేమి కావలయు నని అడుగగా, ఘంటాకర్ణుఁడు తనకు మోక్షము కావలయు ననెను. అందుకు పరమశివుఁడు మోక్ష మిచ్చుటకు విష్ణువే యజమానుఁడు గాని ఇతరులము మే మెవ్వరముకాము కాన బదరికాశ్రమము వెళ్లి నారాయణుని ఆరాధించుమా నారాయణుని కృపచే మోక్షమును పొందు మనెను. అందు

వలన ఆ శివుని ఆజ్ఞను వడసి నారాయణుండే పరమాత్మయని యెంచి నారాయణాశ్రమ మగు యీముక్తి క్షేత్రమమును పొందితిని. అను యీచరిత్రమునుబట్టి మోక్షప్రదుండు విష్ణు వనుటకు సందియము లేదు.

శ్లో. సనత్కుమారోశనసాః వృత్రం ప్రత్యాహ వైష్ణవం;
భరద్వాజం భృగు శ్చాపి తే తత్త్వం భారతే హరేః. 102

శ్లో. శ్రుణు సర్వ మిదం దైత్య విష్ణో ర్మాహాత్మ్య ముత్తమం
విష్ణౌ జగ త్స్థితం సర్వ మితి విద్ధి పరంతప.
అనాదినిధన శ్శ్రీమాన్ హరిః నారాయణః ప్రభుః.
(శాం - మో - 280.)

అను శ్లోకములందు వృత్రునకు ఉశనస్సుమూలకముగా సనత్కుమారులు ఉత్పత్తిలయస్థితులు విష్ణువునందే జగత్తునకు కలిగినవని తెలుపుచు, విష్ణుపరత్వమును తెలియజేసెను.

శ్లో. వ్యజృంభత తత శ్శక్రః తస్మై వజ్ర మవాసృజత్
ప్రవిశ్య వజ్రం వృత్రం చ దారయామాస భారత
దారిత శ్చ స వజ్రేణ మహాయోగీ మహాసురః
జగామ పరమం స్థానం విష్ణో రమిత తేజసః
విష్ణుభక్త్యా హి తే నేదం జగ ద్వ్యాప్త మయా త్తదా
తస్మాచ్చ నిహతో యుద్ధే విష్ణుస్థాన మవాప్తవాన్ (అధ్యా-283).

అనుశ్లోకములనుబట్టి వృత్రుండు దైత్యుండైనను సనత్కుమార వైష్ణవోపదేశబలముచే భక్తియోగమును పొంది విష్ణులోకమును ఘంటాకర్ణునివలె పొందెను. ఇటులనే భరద్వాజులకు భృగుమహర్షి:—

దుర్విజ్ఞేయో హ్యచింత్యాత్మా సిద్ధై రపి న సంశయః
స ఏవ భగవాన్ విష్ణుః రనంత ఇతి విశ్రుతః
సర్వభూతాత్మ భూతస్థః దుర్విజ్ఞేయోఽకృతాత్మభిః
అహంకారస్య య స్స్రష్టా సర్వభూతభవాయ వై
యత స్సమభవ ద్విశ్వం పృష్టోఽహం యదిహ త్వయా.

అనువచనములందు విష్ణుపరత్వమును బోధించెను. కావున సనత్కుమారులు భృగువు మొదలగువారు భారతమందలి విష్ణుపరత్వబోధకు లని తెలియందగు.

పరాశరప్రణీతే తు పురాణే వైష్ణవేఽఖిలం
ప్రతీతం విష్ణుపారమ్యం భాష్యకృద్భిః ప్రదర్శితం. 104

టీ. పరాశరమహర్షిచేత నుపదేశింపఁబడిన శ్రీవిష్ణుపురాణమునందు అంతయు ప్రసిద్ధమైన విష్ణుపారమ్యమే యగును. ఆయాతత్త్వప్రక్రియయందు శంకరరామానుజపూర్ణప్రజ్ఞాచార్యులు మువ్వురున్ను యీవచనములను విషయవాక్యములుగా పరిగ్రహించి యున్నారు. అట్టి విష్ణుపురాణమందు మైత్రేయమహర్షి:—

యన్మయం చ జగ ద్బ్రహ్మ న్యత శ్చైత చ్చరాచరం
లీన మాసీ ద్యథా యత్ర లయ మేష్యతి యత్ర చ.

అనగా చరాచరాత్మకమైన జగత్తు యన్మయమై యున్నది. యెచ్చటనుండి యేతెంచినది? యెచ్చట లయించును— అనిన నందులకు పరాశరమహర్షి:—

విష్ణో స్సకాశా దుద్భూతం జగ త్తత్రైవ చ స్థితం
స్థితిసంయమకర్తాఽసౌ జగతోఽస్య జగ చ్చ సః.

విష్ణువువద్దనుండి జగత్తు పుట్టబడినది. అచ్చటనే యున్నది. విష్ణువే జగత్తును లయింపఁజేయును. జగత్తంతయు విష్ణ్వాత్మకమే అని సమాధానమును జెప్పెను. కావునవిష్ణుపురాణమంతెయు వైష్ణవ మని తెలియఁదగు శంకరరామానుజపూర్ణప్రజ్ఞాచార్యులు మువ్వురును తత్వప్రక్రియయందు విష్ణుపురాణమును తప్ప ఇతరపురాణవచనములను విశేషముగ విషయవాక్యములందు పరిగ్రహించి యుండలేదు. 'ఇతి హాసపురాణం పంచమం'అనెడి ఛాందోగ్యవాక్యమందు అర్థ్యర్థిత్వం పూర్వమనే వ్యాకరణవాక్యమును బట్టి పురాణములకంటె ఇతిహాసములకు గ్రంధసౌష్ఠవ మని పండితుల యభిప్రాయము గాన పురాణములు తత్తద్దేవతాప్రాశస్త్యపరము లగుటచేతఁ బురాణనిర్ణయమును ఇచట వ్రాయలేదు.

శ్లో. వైష్ణవేన చ బింబేన శిల్పీ సౌందర్యవిత్పురా,
కురుతే సర్వబింబాని సమీచీనాని సుస్మృతః. 105

అనాగరమనెడి పేరుగల సాత్త్వికమైన రామకృష్ణాది వైష్ణవబింబములను శిల్పియగు వాఁడు ముమ్ముందు చేసికొని, పిమ్మట దానినిచూచుచు శైవాది బింబములను చేయవలయునే గాని ముందుగా శైవబింబములను ప్రారంభింపఁ డని తాత్పర్యము. ఇందుకు ప్రమాణము:—

శ్లో. బింబం కృత్వా వైష్ణవం తు పశ్యన్ శిల్పీ తతోఽపరం
కుర్యాత్సౌందర్యసిద్ధ్యర్థమన్యథా విపరీతకృత్.

వైష్ణవేషు చ బింబేషు న కుర్యాన్నృహరిం పురా
రామం కృష్ణం శ్రియం కుర్యాత్ వామనం చ హయాననం.
ప్రారంభే సాత్త్వికం కుర్యాత్ పశ్చాద్రాజసతామసే
సాత్త్వికం వైష్ణవం బింబం రాజసం శైవ మంబయా.
తామసం భూతకాళ్యాది పూజితం త్వసులోమతః,
త్యక్త్వా తు సాత్త్వికం శిల్పీ మోహాత్ సిద్ధిం న చాఽప్నుయాత్,
సాత్త్వికం నాగరం ప్రోక్తం ద్రావిళం రాజసం భవేత్
వేసరం తామసం జ్ఞేయం శిల్పశాస్త్రప్రచోదితం.

అని యిట్లు చెప్పుటచేత శిల్పశాస్త్రప్రావీణ్యముకూడ వైష్ణవ పారమ్యమునే తెల్పుచున్నది.

శ్లో. సర్వకర్మసమారంభే సుముహూర్తత్వసిద్ధయే,
కార్తాంతికా వదంత్యేవ లక్ష్మీపతి మనామయమ్. 106

టీ. సర్వకర్మములు ప్రారంభించునపుడు మంచిముహూర్త మగుటకు సూర్యసిద్ధాంతాద్యాచారముల ననుసరించి, "లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి" అని వైదికాచారపారరీతిగ లక్ష్మీపతినే తలచుచున్నారు గాని "గౌరీపతే తేంఘ్రి యుగం స్మరామి" యని వైదికశ్రేష్ఠులు చెప్పుటలేదు.

శ్లో. సూర్యసిద్ధాన్తరీత్యా తు వాసుదేవః పరోఽవ్యయః,
ధ్యేయ ఇత్యుచ్యతే తత్ర చైకాయనపరాయణః. 107

టీ. సూర్యసిద్ధాన్తమందు 12 అధ్యాయములో గోళాధ్యాయమునందు—

వాసుదేవః పరం బ్రహ్మ తన్మూర్తిః పురుషః పరః,
అవ్యక్తో నిర్గుణ శ్శాంతః పంచవింశాత్పరోఽవ్యయః.

అను వచనమునుబట్టి వాసుదేవుడే పరమాత్మ యని

జీవుని కంటె పరుఁడని శుక్లయజుర్వేదోక్తకాయనశాఖ ననుస
రించి వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధుల వ్యూహచతు
ష్టయము కొనియాడఁబడియున్నది.

హరిం హరీతకీం చైవ గాయత్రీం చ దినే దినే,
ఇత్యాహ భిషజాం శాస్త్రం వైద్యో నారాయణ స్స్మృతః. 13

వైద్యశాస్త్రమందు హరిం హరీతకీం చైవ గాయత్రీం
చ దినేదినే అని వ్రాసియున్నందున హరినే దినదినము ధ్యానిం
పవలయును. వైద్యుఁడు నారాయణుఁడనియును పఠించుట ఆ
చార సిద్ధము గాన ఇతరతంత్రములును వైష్ణవప్రభావబోధకము
లగును. మఱియు భాష్యకారులు మువ్వురిమతములందును శంక
రాచార్యులవారి వైష్ణవాచారమును సంపూర్ణముగా గాన్పించి
తిని వారు చేసిన హరిమీడేస్తుతి పాదాదికేశాంత విష్ణుస్తుతి
యనెడు వైష్ణవస్తోత్రములకు భాష్యపంక్తులకు అన్యో
న్యమే యగును చిల్లరగా కొన్ని వైష్ణవేతర దేవతాస్తోత్రములు
వారిచే జేయఁబడినవి యని చరిత్రములయందు శంకరప్రోక్త
మని వ్రాసియుండును. భాష్యపంక్తిపరిపాటికి చిల్లర ఆ అవైష్ణ
వస్తోత్రములకు పొసగదు. ఆమఠమందు చాలా వెనకటి యతు
లు తమమతికి తోఁచినట్లు వ్రాసియుందు రని తెలియందగు.
అట్టి స్తోత్రములు ఆదిశంకర భగవత్పాదాచార్యులసంప్రదా
యమునకు యత్యాశ్రమమునకు ప్రతికూలములే యగును.
ద్వైతు లగుపూర్ణప్రజ్ఞాచార్యులవారి పరంపరయంతయు
వైష్ణవవైభవనిష్ఠాత మనియే నిర్ణయము వారి సిద్ధాంతశ్లోక
మందు 'శ్రీమన్మధ్వమతే హరిః పరతరః' అని వ్రాసియున్నది.

విశిష్టాద్వైతసిద్ధాంతప్రవర్తకు లగు రామానుజలవారి దర్శనమంతయు వైష్ణవమనుటకు సందియ మేమియు లేదు గాన ప్రసిద్ధప్రధానసర్వతంత్రస్వతంత్రు లగు శంకరరామానుజ పూర్ణప్రజ్ఞులు, వారిపరంపరావారును, వైష్ణవోపాసనా మూర్ధన్యులుగానే యుండవలయును.

భారతమందలి సౌగంధికాహరణపర్వమున భీముని సందేహములను తొలగించుటకై పూనిన హనుమంతుఁడు కృతయుగమందలి ఆచారములను తెల్పుచు యుగము మాఱఁగా మాఱఁగా నారాయణోపాసనాచారము మారు నని తెల్పిన భంగి భాష్యకారులకాలము కలియుగమైనను కృతయుగ మనుపించుకొనినది. ఈకాలము నారాయణోపాసనాచారము మారినందున కలిలో కలి యని చెప్పందగును.

ఇట్లు భాష్యకారులచేతను స్మృతిగ్రంథ వ్యాఖ్యానకారులచేతను అంగీకరింపబడిన ప్రమాణవచనములను తెలిపించితిని. ఇందంతయు విష్ణుపారమ్యమే రమ్యముగ వ్యక్తమగుచున్నది ఇందుచేత ఆచార్యులవారిసమ్మతి. ఆచారములపద్ధతి విష్ణుపారమ్యమందే విలసిల్లుచున్నది. ఇందువలన నేను శైవదూషకుఁడనుగాను. ఏక్రియలందు యేదేవతలను పూజించుమని యేయామ్నాయములు ఆజ్ఞాపించుచున్నవో ఆయాదేవతలను ఆయాజ్ఞోల్లంఘనమునకు అశక్తుఁడనై పూజించువాఁడనే యగుదును. అనగా అంగదేవతాపుష్టిచే అంగియగు నారాయణుఁడు సంతుష్టుఁడగు ననే తలంపుచే పూజించుదును. ఇట్టి నారాయణపారమ్యపరాయణతి శంకరరామానుజపూర్ణప్రజ్ఞ

మతావలంబకులగు అద్వైతవిశిష్టాద్వైతద్వైతులగు మువ్వా
రికిని ఒక్కటే పద్ధతియని అందరికి తెలియగలందులకై యీ
పుస్తకము ప్రశస్తమగు నవి వ్రాసితిని.

ఈమువ్వారిలో కాలక్రమముగ వేషములు మిక్కిలిమా
ర్పన ఒకరిపైనొకరు దోషములనే చూపించుకొనుచుండిరి.
పురుషునియభిప్రాయము ఈ మూడుమతస్థుల మూల
మునకే అవిశేషపారమ్యపరాయణులైయుండగా కలహా
పరాయణులైనను ఈమువ్వారు ఏకదేవతాపారమ్య
లనుటకు వీలేలేదు. దేవతానామమూర్తి పూజారహితు
ఈశాన్యదిక్కున వనేవాలయ బ్రహ్మోత్సవాదులందు
గావించుట తదభీష్టగావ్యానము ఋగాదిమంత్రములచే
కిని వాడుకలోనున్న ర్తనపూజాదులను సలుపుట ఇప్పటి
హుతినిచ్చుటయు యాదిహోమాదులందు రుద్రాద్యా
ప్రజ్ఞమతా లంబ లోనున్నది. శంకరరామానుజపూర్ణ
ఐకమత్యమునకే వ్రాసితినిగాని దూషిం
చుటకు
వ్రాసినవాడనుగాను ప్రకృతమందీమువ్వారును పర
స్పరము భోజనవివాహాదులలో సంబంధపరుచుకొనకయుండి
ను ప్రాచీనఋషులకు మూడుమతస్థులలో మూడుభార్యలు
న్నట్లు తెలుసుకొనముగదా గాన మనము ముగ్గురము మో
క్షపద్ధతులలో అభిప్రాయభేదము లేర్పరచుకుంటిమేగాని సూ
త్రోక్తసంస్కారసంబంధములందు కలసియేయున్నాము. పతి
తులతో అధ్యాపనసంబంధము కలసినయెడల సద్యఃపతనము
నుగావించునుగదా అట్టిఅధ్యాపనము మన మువ్వారిలో యిప్ప
టికిని ఒకరికొకరు యేర్పడుచున్నదిగదా. ఒకరికొకరు దూ

షించుకొనినను పరస్పరము వేదశాస్త్రాధ్యాపనమునుమాత్రము
ను మనము పరస్పరము వదలనేలేదు గాన మనమందరికిని ఆ
చార్యోపాసనానుసారము నారాయణపారమ్యపరాయణత్వము
శిరసాగ్రాహ్యమైయున్నది. కామక్రోధోద్రేకముచే ఒకరినొక
రుదూషించుట శైవవైష్ణవులకేయని తలపతగదు. విశిష్టాద్వై
తులలో వడకల తెంగలకలహములచే విగ్రహములముక్కు
విరవగొట్టుట, మాధ్వులలో ప్రథమతీర్థమునకై దెబ్బ
స్మార్తవులలో తాటంకప్రతిష్ఠకై ఇంజెంగుహలతో
ట, వడకలలో వడకలవారికే మఠమునా? అన్నద
మునుగుట ప్రఖ్యాతిగ నున్నది ఇంతయువాదపడు
మ్ములలో దాయభాగప్రాప్తికై అన లప్పీదమ్ముల
చుండగా కడమవారికేమని చెప్పవలయు క్రోధము
లో మతభేదమేమియున్నది గాన కలహము అథవా
లే మూలపురుషులు. ఇందుచేత దూషణపభంగిచే
దూషణము లున్నట్లుయెంచినను నహి నింద
పెద్దలు సమాధానమును చేసుకొందురు.

ఇచ్చట వచనములందుగాని అర్థమునువ్రాయుటలో
గాని పొరబాటులున్నవని పెద్దలు తెలియపరచినచో మరు
కూర్పున సవరించుకొనువాడను.

శ్లో. కస్తూరీ రామానుజార్యోహం భారద్వాజసుగోత్రజః,
ఆచార్యకృపయాప్రోక్తం విష్ణుపారమ్యవైభవమ్.
అష్టోత్తర శతశ్లోక సుమనస్సు కృతాం హితామ్,
వనమాలి పదేక్షిప్తాం మాలామేతాం సమర్పయే.

చెన్నపురి: ఆర్యభారతీ ప్రెస్సున ముద్రితము—1929.